# "జయంతి" ఆలోచన సంఘము.

**సారస్వతము:—**

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, బారిష్టరు, గుంటూరు
" విజనూరి రంగాచార్యులుగారు ఎం. ఏ; బి. ఎల్ "
" ఇవటూరి కనకాచలం పంతులుగారు ఎం. ఏ; ఎల్. టి. పర్లాకిమిడి
" వండూరి వెంకట సుబ్బారావుగారు బి. ఏ; బి; ఎల్; ఏలూరు

**ధర్మశాస్త్రము.:—**

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరం
" కిడాంబి రంగాచార్యులుగారు ఎం. ఏ; బి. ఎల్, "
" బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు పర్లాకిమిడి
" కావ్యవ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు మద్రాసు

**లలితకళలు:—**

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు, విజయనగరము
" అడివి బాపిరాజుగారు బి. ఏ, భీమవరము
" వెల్లంకొండ రాఘవరావుగారు, పమిడిపాడు
" పి. వి. రాజమన్నారుగారు, బి. ఏ; బి. ఎల్, చెన్నపట్టణము
" గోవర్ధన రామదాసుగారు బి. ఏ; యం. ఆర్. ఏ. యస్., జయపురము

**వార్తాశాస్త్రము:—**

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఎం. ఏ; ఎల్. టి., విజయనగరము
" బసవరాజు రామచంద్రరావుగారు ఎం. ఏ, కలకత్తా

**చరిత్ర-రాజనీతి:—**

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు బి. ఏ; బి. ఎల్, రాజమహేంద్రవరము
" విజనూరి గోవిందరాజాచారిగారు బి. ఏ; బి. ఎల్, చెన్నపట్టణము
" కొలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి. ఏ; బి. ఎల్, "

**భౌతిక శాస్త్రము:—**

శ్రీ డాక్టరు వి. ఎల్. నారాయణగారు, ఎం. ఏ; డి. ఎస్. సి,
" డాక్టరు జయంతి చినకామేశ్వరరావుగారు, ఎం. ఏ; డి. ఎస్. సి,
" పాతూరి, పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ; ఎల్. టి,

**రసాయన శాస్త్రము:—**

డాక్టరు యేమూరి వెంకటరామయ్యగారు, డి. ఎస్. సి, విజయనగరము
శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణగారు, ఎం. ఏ; ఎల్. టి., చెన్నపట్టణము
" సుసర్ల రాజాగారు, బి. ఏ, వారాణసి

**ప్రకృతి శాస్త్రము:—**

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ, అనంద కళాశాల,
" డాక్టరు వుప్పల లక్ష్మణరావుగారు, ఎం. ఏ; డి. ఎస్. సి; (జర్మని)
" పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఏ, బందరు
" శొంఠి పురుషోత్తముగారు, ఎం. ఏ, విజయనగరం.

# జయంతి

సంపుటము ౧ సంచిక ౬

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః

సంపాదకుడు

విశ్వనాథ సత్యనారాయణ బి. ఎ.

# "జయంతి" ఆలోచన సంఘము.

**సారస్వతము:—**

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, బారిష్టరు, గుంటూరు
,, వింజమూరి రంగాచార్యులుగారు ఎం, ఏ; బి. ఎల్ ,,
,, ఇవటూరి కనకాచలం పంతులుగారు ఎం, ఏ; ఎల్, టి. పర్లాకిమిడి
,, వందూరి వెంకట సుబ్బారావుగారు బి, ఏ; బి; ఎల్; ఏలూరు

**ధర్మశాస్త్రము.:—**

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరం
,, కిళాంబి రంగాచార్యులుగారు ఎం, ఏ; బి, ఎల్, ,,
,, బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు పర్లాకిమిడి
,, కావ్యవ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు మద్రాసు

**లలితకళలు:—**

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు, విజయనగరము
,, అడివి బాపిరాజుగారు బి, ఏ, భీమవరము
,, వెల్లంకొండ రాఘవరావుగారు, పమిడిపాడు
,, పి. వి. రాజమన్నారుగారు, బి, ఏ; బి, ఎల్, చెన్నపట్టణము
,, గొడవర్తి రామదాసుగారు బి, ఏ; యం, ఆర్, ఏ, యస్, జయపురము

**వార్తాశాస్త్రము:—**

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఎం, ఏ; ఎల్. టీ, విజయనగరము
,, బసవప్న రామచంద్రరావుగారు ఎం, ఏ, కలకత్తా

**చరిత్ర-రాజనీతి:—**

శ్రీ భావరాజు వెంకట కృష్ణారావుగారు బి, ఏ; బి, ఎల్, రాజమహేంద్రవరము
,, విజమూరి గోవిందరాజాచారిగారు బి, ఏ; బి, ఎల్, చెన్నపట్టణము
,, కొలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి, ఏ; బి, ఎల్, ,,

**భౌతిక శాస్త్రము:—**

శ్రీ డాక్టరు ఎ. ఎల్. నారాయణగారు, ఎం, ఏ; డి, ఎస్, సి,
,, డాక్టరు జయంతి చినకామేశ్వరరావుగారు, ఎం, ఏ; డి, ఎస్. సి,
,, పాతూరి, పట్టాభిరామయ్యగారు, ఎం, ఏ; ఎల్ టీ,

**రసాయన శాస్త్రము:—**

డాక్టరు యేచూరి వెంకటరామయ్యగారు, డి, ఎస్, సి, విజయనగరము
శ్రీ కొల్లూరి సూర్యనారాయణగారు, ఎం, ఏ; ఎల్. టీ, చెన్నపట్టణము
,, సుసర్ల రాజాగారు, బి. ఏ, వారాణసి

**ప్రకృతి శాస్త్రము:—**

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం, ఏ, ఆనంద కళాశాల,
,, డాక్టరు ఉప్పల లక్ష్మణరావుగారు, ఎం, ఏ; డి, ఎస్, సి; (జర్మని)
,, పురాణం సూరిశాస్త్రిగారు, బి, ఏ, బందరు
,, కొండ పురుషోత్తముగారు, ఎం, ఏ, విజయనగరం.

# విషయసూచిక


| | పుటలు |
|---|---|
| **ప్రేమగీతాలు** | |
| గిరికుమార | ౧ |
| **చక్రవాక మిధునము** | |
| చింతాదీక్షితులు | ౨-౧౪ |
| **పూజాప్రసూనములు** | |
| శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి | ౧౫ |
| **చిట్టిశ్యామల** | |
| ముద్దు కృష్ణ | ౧౬ |
| **పాట** | |
| శ్రీ కృష్ణశాస్త్రి | ౧౭-౧౮ |
| **మఃకోటి** | |
| కాసాని వెంకట నరసింగరావు | ౧౯ |
| **గీతములు** | |
| తెలికిచర్ల కృష్ణమూర్తి | ౨౦-౨౧ |
| **జన్మాంతరము** | |
| పెనుమర్తి వెంకటరత్నము | ౨౨-౨౩ |
| **లీలాకమల** | |
| ప్రిథల రామబ్రహ్మానందం | ౨౪ |
| **ఫలశ్రుతి** | |
| నాయని సుబ్బారావు | ౨౫ |
| **గీతములు** | |
| పువ్వాడ శేషగిరిరావు | |
| చోడవరపు జానకిరామయ్య | ౨౬ |

పాట ౨౬

కాలపుటూపిరి

దువ్వూరి రామిరెడ్డి ౨౭

గోదావరీ సంగమము

విశ్వనాథ సత్యనారాయణ ౨౮–౪౭

శ్రీకృష్ణరాయబారము

ఉన్నవ లక్ష్మీనారాయణ ౪౮–౫౯

శాతవాహనవంశీయుల శాసనములు

భావరాజు వేంకటకృష్ణారావు ౬౦–౬౯

పురాతన భారతీయ పురనిర్మాణము

కిళాంబి రంగాచార్యులు ౭౦–౭౮

ఆశాకిరణము

నోరి నరసింహశాస్త్రి ౭౯–౮౦

## త్రివర్ణ చిత్రములు

త్యాగరాజు

వాసుదేవన్. అడయారు.




పలుక రాని జ్యోతిస్సు నా ప్రణయ మెల్ల
కావ్య రూపమ్ముగా నిట్లు కరఁగఁబోసి
ప్రళయ కాల నిగూఢ గర్భమ్ము నందు
దీని యాకృతిఁ గూర్చి చింతించు చుంటి

ఈ మహాద్వైత భావ మిదింత కుదిరి
కుదుర నీయద యేలో నా హృదయ శాంతి
ఈ సుకావ్యాకృతిం గుదియించి వైచి
దివ్య మగు జ్యోతిగా సమర్థింప నెంతు

విగత తృష్ణుని నన్నింత వెక్కిరించు
నీ మహాతృష్ణ—

ప్రేమ గీతాలు — గిరికుమార

# చక్రవాక మిథునము

## చింతా దీక్షితులు

దేశము గోదావరి అద్దరి ఇద్దరి

కాలము ఆషాఢ మాసము: ఒకనాటి రాత్రి

పాత్రలు చక్రవాకము; చక్రవాకి

అద్దరిని చక్రవాకము ఒక చెట్టుమీద చిట్టచివర కొమ్మ మీద కూర్చున్నది

ఇద్దరిని చక్రవాకి ఒక చెట్టుమీద చిట్టచివర కొమ్మమీద కూర్చున్నది

౧

మొదటి జాము

చక్రవాకము

కువ కువ కువ కూయి కూయి కూ......యి

చక్రవాకి

కూ...యి; కూ...యి; కూ...యి.

చక్రవాకము

గోదావరి హోరు పెట్టుతోంది. ఎందుకో చెప్మా? ఈ గోలలో నా సఖి కంఠమే వినరాకుండా ఉన్నది. కువ కువ కువ కువ కూ...యి కూ......యి.

చక్రవాకి

కూ......యి, కూ......యి, కూ......యి

చక్రవాకము.

గోదావరీ తల్లి! కొంచెం నీ హోరు తగ్గిద్దూ అమ్మా? నీకు పుణ్య ముంటుంది! ఎక్కడా మాట వినబడకుండా చేస్తున్నావు. కువ కువ కూ......యి, కూ......యి, కూ......యి

చక్రవాకి

నా నాథుని పిలుపు లాగ వినిపిస్తోంది. నా లాగే యీ గోదావరీ ఎన్ని తిరుగుళ్లు పడుతూ ఉందో! కూయి, కూ...యి, కూ...యి.

చక్రవాకము

ఆఁ. వినిపించింది. అవతల గట్టున ఉంది నా సఖి. దాని గొంతుకే అది. సందేహం లేదు...ఈ రాత్రి ఈ గోదావరి మా కడ్డు వచ్చిందా! ఎప్పుడూ ఉపకారం అందరికీ చేసే యీ గోదావరి మా కిప్పుడు అపకారం చేస్తూ ఉంటని మేమనుకో వలసి వచ్చింది గదా! కూ...యి, కూ...యి, కూ...యి.

చక్రవాకి

ఎవరి గొడవ వారిది, ఎవరి ఆవేదన వారిది. ఒకరి కష్ట సుఖాలు ఇంకొకరికి కావాలా ఏమిటి ఈ లోకంలో. గోదావరి గొడవ గోదావరిది. మా గొడవ మాది. కువ కువ కువ కువ కూ......యి, కూ......యి కూ......యి.

చక్రవాకము

ఇంకా నా సఖి నాగొంతుక గుర్తించలేదు, కాబోలు. గోదావరీ తల్లీ! ఇందరి కిన్ని ఉపకారాలు చేస్తున్నావు. కొంచెం నా పిలుపు అవతలి గట్టుకు చేరవేద్దూ! ఎంత తహతహ పడుతోందో నా సఖి. కువ కువ కువకువ కూ......యి కూ......యి కూ......యి

చక్రవాకి

చీకట్లు క్రమ్ముకు వస్తూ ఉన్నవి. ఒక్క నక్షత్రమైనా మెరయుడం లేదు. గోదావరి నూలువిననీయకుండా వున్నది. అసలు నా నాథుడు ఆ గట్టున వున్నాడో లేడో గట్టిగా పిలిచి చూస్తాను. కువ కువ కువ కువ కూ......యి, కూ......యి, కూ.. ...యి

చక్రవాకము

గోదావరికి కూడా దయ లేకుండా వున్నది. ఏ చెట్టు అనుకొని ఏ చెట్టుమీద కూర్చున్నానో ఈ చీకట్లో తెలియడంలేదు. నాసఖి గొంతుకే అనుకున్నాను. ఈ గాలి హోరులోనూ ఈ గోదావరి హోరులోనూ ఏ శబ్దమేదైనదీ తెలియడంలేదు. కూ......యి కూ......యి, కూ......యి

చక్రవాకి

నా నాథుణ్ణి దగ్గిర కూర్చోబెట్టుకొని ముక్కుతో రెక్కలు దువ్వుతూ విలాసముగా వుందా మనుకుంటే ఇంతట్లో ఈ చీకటి వచ్చి పడింది. ఆ గట్టున మంచి ఇసుకలూ చెట్లూ వున్నవి రమ్మని నాతో చెప్పి వెళ్లిపోయినాడు. నేనూ వెళ్ళవలె నని రెక్కలు విప్పేలోగా ఇంతటి కష్టదశ సంభవించనా? ఎంత పిలిచినా పలకడములేదు. ఏమైనాడోగదా నా నాథుడు! కువ కువ కూ...యి, కూ......యి, కూ......యి

చక్రవాకము

ఎన్ని రాత్రిళ్లు వచ్చినా ఇంక ఎప్పుడూ నిన్ను వదిలిపెట్ట నని మాటఇచ్చేను నా సఖికి. ఈవిడ బాటు ఏలాగ కలిగిందో తెలియకుండానే కలిగింది. ఏ మనుకుంటూ ఉందో నా సఖి నన్ను గురించి. పలకరిద్దా మంటే నా మాట నన్ను దాటే వెళ్ళడంలేదు. కూ......యి...... కూ......యి...కూ......యి

చక్రవాకి

ఎందుకు వచ్చిన ఇసుకలు ఎందుకు వచ్చిన చెట్లు? ఉన్నచోట ఉంటే ఇన్ని పాట్లు రాకపోవును గదా! ఏదో అనుకోవడమే కాని ఎన్ని మార్లు ఇదివరలో ప్రయత్నము చేశాము కాము, చీకటి పడే టప్పటికి ఒకరి నొకరు విడవకూడ దని. ఎప్పటి కప్పుడు ఏదో ఒకటి సంభవిస్తూ వుండి. పోనీ ఏమి వచ్చినా బ్రదికి ఉన్నాడనుకొని సంతోషించడానికైనా మాట వినబడితే గదా. కువ కువ కూ......యి కూ......యి...కూ......యి

చక్రవాకము

అయ్యో, ఈ చీకట్లో ఈ గుడ్లగూబ కూత లేమిటి, ఈ కీచు రాళ్ళ గోల యేమిటి, ఈ పక్షుల గొడవ యేమిటి? ఇదంతా ఎందుకు నా చెవిలో పడాలి. నా సఖి మాట నా చెవికెందుకు చేరదు? అయ్యో కువ కువ కూ......యి కూ......యి కూ......యి

చక్రవాకి

ఈ కొమ్మలమీద ఈ పక్షులు ఏలాగున ప్రసంగించుకొంటు న్నారో? ఈ మెరుగుడు పురుగులు ఎలాగ వాటికి కాగడాలు వేస్తు

న్నారో? ఈ నక్షత్రములు మబ్బుల వెనుకనుంచి ఏలాగున నవ్వుతూ. మాయమౌతూన్నారో? ఈ అవస్థ నాకే రావా! అమ్మయ్యో! ఎక్కడున్నాడో గదా నా నాధుడు? కువకువ, కువకువ, కూ...యి, కూ.........యి, కూ.........యి

చక్రవాకము

ఈ గొడవలతో నాకు లాభములేదు. మనస్సు చెదరకుండా నా సఖి మీదనే లగ్నముచేసి పిలుస్తాను. వినబడకుండా ఎందుకు, ఉంటుందో చూస్తాను. ఇంకో ప్రసంగము నా కెందుకు? 'కువ కువ కువ కువ, కూ.....యి, కూ.....యి కూ......యి

చక్రవాకి

దుఃఖంలో సుఖాన్ని తలుచుకొంటే ఆ దుఃఖం ఎక్కువౌ తుంది. ఎవరి సుఖదుఃఖాలసంగతీ నాకెందుకూ? నా నాధుణ్ణి పిలవడం తప్ప ఇంక నాకేమీ పని ఉండగూడదు. లక్ష్యము చెదిరిన కొద్దీ దుఃఖము ఎక్కువ అవుతూనే ఉంటుంది. ఇంక నాకు ఒక్కటే పని కువకువ, కువకువ, కూ...యి, 'కూ...యి, కూ...యి,కూ......యి

చక్రవాకము

కూ...యి, కూ...యి,...కూ...యి, కూ...యి...

చక్రవాకి

కూ...యి, కూ...యి, కూ...యి, కూ...యి...

౨

రెండవజాము.

చక్రవాకము.

కూ...యి, కూ...యి, కూ......యి,

చక్రవాకి.

కూ...యి, కూ......యి, కూ......యి,

చక్రవాకము.

నోరెండుకు పోయింది. గొంతుక బొంగురు పోయింది. నా సఖి నా కంఠాన్ని గుర్తించలేదు. నేను నాసఖి కంఠాన్ని గుర్తించ

లేదు. ఏమయినదో గదా నా ప్రాణేశ్వరి. ఎంతకాలమో గదా ఈ అనుభవమూ, కూ...యి,...కూ...యి...

చక్రివాకి

ఈ నల్లటి మేఘాలన్నీ ఆకాశాన్ని చుట్ట బెట్టుకొంటున్నవి. ఈ మెరుపులేమిటి? ఈ పిడుగు లేమిటి? ఈ పిడుగులమధ్య నా పిలుపు ఏమి కాను? అయినా పిలనకుండా ఎలాగ ఉండడం. కూ......యి, కూ......యి, కూ......యి

చక్రివాకము

ఈ గోదావరి హోరును మించి, ఈ పిడుగుల చప్పుడు మించి నేను నా సఖిని పిలవగలనా? అయినా చూస్తాను. కూ.........యి కూ......యి, కూ......యి,

చక్రివాకి

ఈ మాటు జాగ్రత్తగా వుండి మెరుపు మెరిసినప్పుడు నా నాథు డవతలగట్టున వున్నాడేమో చూస్తాను. కూ...యికూ...యికూ...యి

చక్రివాకము

భగవంతుడు ఈ గాలివాన భయము ఏమీ లేకుండా నా సఖిని రక్షించడూ? కూ...యి, కూ...యి, కూ...యి

చక్రివాకి

మెరుపు వచ్చింది పోయింది. నా కన్నులు మాత్రం చీకట్లు క్రమ్మినవి. నా నాథుడు కానరాలేదు. లోకమంతా మాకు అపకారమే తలపెట్టినా, పోనీ ఈ గాలివానలో నా నాథుడు చల్లగా వుంటే చాలు. కూ...యి కూ...యి, కూ......యి

చక్రివాకము

పంచభూతములూ మా మీద ఆగ్రహించినవి. వాటినైనా ప్రార్థిస్తాను నా సఖిని చల్లగా చూడమని, కూ...యి, కూ...యి, కూ...యి

చక్రివాకి

ఈ గాలి వచ్చి కళ్ళల్లో దుమ్ము కొడుతోంది. ఈ వాన రెక్కలన్నీ తడిపివేసింది. ఈ పిడుగుల వల్ల చెవులు గింగురు మంటున్నవి.

ఈ మెరుపుల వల్ల కళ్ళు చీకట్లు పడినవి. ఇంక యెలాగ నా నాథుణ్ణి పిలవడం, వినడం, చూడడం, పొందడం. ఎవరికీ దయలేదేమిటి మా మీద. కూ...యి, కూ...యి, కూ...యి

చక్రవాకము

ఏమి వాయుదేవుడా! నీవు నా మాట నా ముఖం మీదే కొట్టకపోతే తీరదా? పోనీ నా పిలుపు అవతలి గట్టుకు తీసుకుపోరాదా? అక్కడ నా సఖి నా కోసం కొట్టుకొంటూ ఉంటుంది. కూ...యి కూ...యి...

చక్రవాకి

నిద్రపోయిన పక్షులన్నీ లేచి ఒకరి నొకరు అనునయించు కొంటున్నవి. న న్ననునయించేవా రేరీ? కూ...యి, కూ.. యి...

చక్రవాకము

నీవైనా నేను చెప్పిన మాట విందూ వానదేవుడా! నిశ్శబ్దంగా రవంత సేపు నీ హోరు తగ్గిస్తివా నా సఖిని పిలుచుకొంటాను. పోనీ చేతనైతే నా పిలుపు అవతలి గట్టుకు అందజేద్దూ. కూ...యి కూ...యి...

చక్రవాకి

ఈ వేళ అమావాస్య కూడా కాబోలు. చంద్రుడుంటే ఆశ పెట్టనైనా ఆశ పెట్టేవాడు? ఇప్పుడు ఆ ఆశ కూడా లేకుండా పోయింది. "ఆ చివర కొమ్మమీద కూర్చుని ఆలాగున తడిసే బదులు ఆకుల సందున దాక్కోరాదా" అని పక్క పక్షులు నా కుపదేశం చేస్తున్నవి! ఎవరి ఆవేదన ఎవరికి తెలుస్తుంది. కూ...యి, కూ...యి, కూ...యి.

చక్రవాకము

ఏమయ్యా ఆకాశ రాజా! నీ మణిని ఎక్కడ దాచిపెట్టే వయ్యా? అందరినీ కనిపెట్టే నీవు మా కింత అపకారం చెయ్యవలసి వచ్చిందా నాయనా? నా శబ్దం నీలో దాచుకొనే బదులు నా సఖికి అందజేయరాదూ పుణ్యముంటుంది. కూ...యి కూ...యి, కూ...యి.

చక్రవాకి

కాలం పరివర్తిస్తేనేగాని ఏమీ లాభం లేదు. ఈ దుర్భర దుఃఖాలలో నాకు ఉపశమన మిస్తున్నది నానాథుని పిలుపు ఒక్కటే. కూ...యి, కూ...యి, ...కూ...యి

చక్రవాకము

ఎవరికి మొక్కుకున్నా ఏమీ లేదు. చీకట్లు చిక్కబడి చిక్కబడి అవే విచ్చిపోతవి. అనంతమైన కాలమంతా ఒక్క రాత్రి కాదుగదా? నా సఖిని పిల్చుకొంటాను. లాభించినా మానినా అదొక్కటే. కువకువ, కువకువ కూ...యి, కూ...యి, కూ.....యి

చక్రవాకి

కువకువ, కువకువ, కూ...యి, కూ...యి, కూ...యి

చక్రవాకము

కూ.....యి, కూ.....యి, కూ.....యి,

మూడవజాము

చక్రవాకము

దుఃఖం ఎక్కువ అయి ఎక్కువ అయి మొగం మొత్తుతుంది- ఎందుకో గాని ఈ దుఃఖం నా హృదయంలో ఉండలేక బయటికి పోతోంది. ఏమిటో కారణం! కూ...యి, కూ...యి కూ.....యి

చక్రవాకి

మబ్బులు మాయమయ్యేయి, పిడుగులు పోయేయి. నక్షత్రాలు రెప్పవెయ్యకుండా నా కేసి చూస్తున్నాయి. పోనీ ఈ నక్షత్రపు కాంతిలో నా నాధుడు కనబడితే బాగుండును. కూ...యి కూ...యి, కూ...యి

చక్రవాకము

ఆశ్చర్యం. ఇంతగాలి వచ్చి యింత వాన వచ్చి ప్రపంచం అంతా తారుమారైనా ఈ గోదావరి ఒకటే గోలపెట్టుతూ ప్రవహిస్తోంది గదా. మనోనిగ్రహం అంటే ఆలాగున ఉండాలి. కూ...యి, కూ...యి, కూ...యి

చక్రవాకి

ఈ ప్రళయములో నా నాథుని కేమీ ఆపద సంభవించ కుండా వుండాలిగద! ఎంత పిలిచినా పలకడు, ఎంత చూచినా కనబడడు, కూ...యి, కూ...యి కూ......యి

చక్రవాకము

అయ్యేది అసకమానదు. నా సఖి కోసం యింత తహతహ పడు తున్నా పిలుపుకు మారు పిలుపైనా వినబడ కూడదూ. కూ...యి కూ...యి, కూ...యి

చక్రవాకి

ఇంక లాభం లేదు. ఇక ప్రళయం వచ్చాక ఇంక నా నాథు డెక్కడో నే నెక్కడో! ఈ కొమ్మ చిట్టచివరకు వెళ్లు తాను. సరిగ్గా గోదావరి మీాద ఉంటాను. నా గోలను ఈ గోదావరి గోలతో కలుపుకుంటాను. ఆవిడ ఎంతైనా భరించ గలదు. ఎందు కింక బ్రతకడం కూ...యి, కూ...యి, కూ...యి.

చక్రవాకము

ఈ దుఃఖంలో లోకం అంతా నన్నెగతాళి చేస్తూ ఉంది. నా సఖి కంఠం వినిపిస్తే ఆ ఎగతాళే స్వర్గం కింద భావించే వాడిని. ఇంత సేపు పిలిచాను. ఒక్క మారైనా ఓ అన్న ముక్క చెవులలో పడక పోతే? ఎందుకీ బ్రతుకు? ఈ చిట్ట చివర కొమ్మ మీాద నిల బడతాను. కళ్లు మూసుకొని ఈ గోదావరిలో నా దుఃఖ మంతా కలిపి వేస్తాను. కూ...యి, కూ...యి, కూ......యి

చక్రవాకి

ఇంకొక్క మారు గట్టిగా పిల్చి ఆ తరవాత—కూ...యి. కువ కువ ... కూ...యి, కూ...యి, కూ...యి

చక్రవాకము

నేను తొందర పడడం లేదు కదా. ఒక వేళ నా సఖి బ్రిదికే ఉందేమో? లోకంలో ఉన్న దుఃఖమంతా కలిసి ఒక్కమారు మొర పెట్టుకొంటూ ఉన్నట్లు మొర పెట్టుతాను. నా సఖి బ్రిదికే ఉన్నట్లయితే నాకు మారు పలుకుతుంది. కువ కువ కూ...యి, కువ కువ కువ కువ కూ...యి, కూ...యి, కూ......యి

చక్రివాకి

ఇంక లాభం లేదు. ఎక్కడా సమాధానమే లేదు. పిలుస్తూనే గోదావరిలో కలిసిపోతాను. కూ......యి కూ......యి కూ...యి

చక్రివాకము

మారుపిలుపు వచ్చినట్లయినా అలుకుడు లేదు. ఎందుకింక ఆశపెట్టుకోవడం, అలవాటైన ఈ పిలుపు అప్రయత్నముగా నోటినుంచి వస్తూనే వుంటుంది కాబట్టి ఆ గోదావరీ గర్భంలో ప్రవేశించినా నా సఖిని పిలుస్తూనే వుంటాను. కూ...యి, కూ......యి, కూ ..యి

౪

నాలుగవ జాము

చక్రివాకి

భ్రమా? లేక నిజంగా వినబడ్డదా? ఏమీ సందేహం లేదు. నా నాథుని పిలుపే అది. ఎంత ఘోషం జరిగేదీ. అన్నా, కువ కువ కూ......యి, కూ......యి, కూ......యి

చక్రివాకము

ఎంత తొందరపడ్డాను. అదుగో నా సఖి కంఠమే అది. ఎంతేసేపటి బట్టి పిలుస్తూ ఉందో! కువ కువ, కూ......యి, కూ......యి కూ......యి

చక్రివాకి

అవును. నా నాథుని పిలుపే అది. ఈ అనంతమైన ఈ అవకాశములో లోకమంతా నిద్రపోతూ ఉంటే లోకాని కంతకూ ప్రతినిధినై ఈ దుఃఖాన్ని ఎవరికి వెళ్లబోసు కుంటూ ఉన్నట్లు మరి. నా నాథుడే. సందేహం లేదు- నా నాథుడి పిలుపే అది. కూ..... యి కూ......యి, కూ...... యి

చక్రివాకము

సఖీ, సఖీ, నా మాట వినబడుతూ ఉందా ? కూ......యి కూ......యి,

చక్రవాకి

ఓయి, ఓయి, కొమ్మ చివరకు, రా నా స్వామీ, నిన్ను చూచుకొంటాను.

చక్రవాకము

కొమ్మ చివరనే ఉన్నాను. నా కూతను బట్టి నా దిక్కు నిర్ణయించుకో కూ...యి, కూ......యి,

చక్రవాకి

ఈ చీకట్లో కన్ను చూడలేకుండా ఉంది. కాని హృదయం చూస్తూ ఉంది. కూ......యి, కూ......యి, కూ......యి

చక్రవాకము

నీవు అలాగ పిలుస్తూ ఉండు. ఈ చీకట్లో నీ కూతను బాట గా చేసుకొని నీ దగ్గరకు వస్తాను. కూ .....యి, కూ......యి

చక్రవాకి

ఏమి ప్రమాదమో, వద్దు వద్దు, ఈ చీకట్లో అన్ని బాటలూ నశించి పోయినవి. సుఖానుభవం ప్రారంభ స్థితిలో ఉన్నప్పుడు ఏరిదు సుఖం కోసము దుఃఖము తెచ్చి పెట్టుకో రాదు. కూ......యి కూ......యి,

చక్రవాకము

నీ వక్కడే ఉండు నే వస్తున్నా. నా కూత వింటూ ఉండు- నీ కూతతో నాకు దారి చూపించు- కూ...యి, కూ...యి, కూ...యి

చక్రవాకి

అమ్మయ్యో నీ వేమై పోతావో. నేను నిన్ను కలుసుకొంటా తోవలో. కూ......యి, కూ......యి, కూ......యి

చక్రవాకము

సఖీ, ఎక్కడున్నావు నీవు. కూ......యి, కూ......యి,

చక్రవాకి

ఎక్కడ నా స్వామీ నువ్వు, కూ......యి, కూ......యి,

చక్రవాకము

పైని ఆకాశం, కింద గంగా. ఈ అవకాశ మంతా నిండినది నా సఖ పిలుపు. ఎక్కడో, ఎలాగో వెళ్ళడం, కూ.....యి, కూ...యి,

చక్రవాకి

చెట్టుకొమ్మను వదిలి ఎక్కడకో వెళ్తున్నాను. నా కూతా నా నాథుని కూతా ఏకమై దిఙ్నిర్దేశము చేయడము కష్టంగా ఉంది. కూ.....యి, కూ.....యి,

చక్రవాకము

కూ.....యి, సఖీ!

చక్రవాకి

కూ.....యి, స్వామీ!

చక్రవాకము

ఎక్కడ ఉన్నావు నా సఖీ, గట్టు కానరాకుండా ఉంది. కూ.......యి,

చక్రవాకి

గోదావరి మీద ఎగురుతున్నాను స్వామీ! మలిన మైన ఈ గోదావరీ జలములో నక్షత్రపు తళుకులు కనిపిస్తున్నవి కాని ఎంత వెదికినా నీ ప్రతిబింబము కానరాకుండా ఉన్నది. కూ .....యి,

చక్రవాకము

నా సమీపములోనే ఉన్నట్లున్నావు. ఇటు రా సఖీ! ఇటు ఇటు కూ......యి

చక్రవాకి

ఎక్కడ స్వామీ! ఎక్కడ ఎక్కడ? అయ్యో, చీకటే అంతటా నా దృష్టిని ఎదుర్కొంటూ ఉన్నది. ఎక్కడ స్వామీ కూ......యి.

చక్రవాకము

అయ్యో నా సఖ గొంతుక దూరమై పోయినది. సఖీ, నే నిక్కడున్నా. విషాదకూజితాలు చేసుకుంటూ నా సఖ ఎక్కడకో పోతూ ఉంది. సఖ, ఇటు రా, ఇటు రా, కూ......యి కూ......యి

చక్రవాకి

మళ్ళీ మొదటి దశకు వచ్చాను. నా నాథుని పిలుపు అంత కంతకు అస్పష్ట మౌతూ ఉంది. నా నాథుని కోసం ఈ ఆకాశమంతా వెదుకుతాను. కూ......యి, కూ......యి,

చక్రవాకము

అయ్యో నా సఖి దూరమై పోయింది. ఏ దిక్కున ఉందని వెళ్ళను? కూ......యి, కూ......యి,

చక్రవాకి

ఈ గోదావరి నీటి మట్టము ననుసరించి పోతాను. ఎప్పటికైనా నానాధుని నీడ గోదావరిలో కనబడకుండా ఉంటుందా, కూ......యి కూ......యి,

చక్రవాకము

సఖి, ఇక్కడున్నా, కూ......యి, కూ......యి

చక్రవాకి

ఈ చెట్టు గోదావరి మీద తేలుకుంటూ పోతూ ఉంది. దీని మీద కూర్చుని నా నాధుణ్ణి పిల్చుకొంటాను. కూ......యి, కూ......యి.

చక్రవాకము

అదుగో నా సఖి కంఠం. నా సమీపానికి వస్తూ ఉంది. కూ......యి, కూ......యి,

చక్రవాకి

కూ......యి, కూ......యి,

చక్రవాకము.

గోదావరి నానఖి కంఠంతో కూస్తూ ఉన్నట్లున్నది. గోదావరి నీటిని సమీపించి వింటాను. కూ......యి, కూ......యి,

చక్రవాకి

అదుగో నా నాధుడు. కూ......యి, కూ......యి

చక్రవాకము

అదుగో నా నఖి కంఠస్వరము కూ......యి,

చక్రవాకి

ఏడీ, ఎక్కడ, ఇక్కడున్నట్లే తోచిందే నా నాధుడు, కూ......యి,

చక్రవాకము

ఎక్కడున్నావు సఖి, వస్తున్నా- కూ......యి, కూ......యి

సరి

చక్రివాకి

కంటికి కప్పిన చీకట్లు విడుతూ ఉన్నట్లున్నవి. అదుగో నా నాథుని నీడ కూ... . యి,

చక్రివాకము

అదుగో సూర్యభగవానుడు వస్తున్నాడు. మా కోసం చీకట్లను కరిగిస్తున్నాడు. అదుగో నా సఖి, కూ.....యి,

చక్రివాకి

నాధా, రా, రా, రా స్వామీ, రా, రా నా ప్రియ కూర్చో.

చక్రివాకము

ఎంత పుణ్యము. అదుగో నా సఖి ఆ కొమ్మ మీద. గోదావరీ తల్లి తన హృదయం మీద కూర్చో బెట్టు కుంది. వెళ్ళు తున్నా నా సఖి దగ్గిరికి. కూ.....యి.

చక్రివాకి

కూచో స్వామీ కూచో. నా ప్రియుని కూచో. ఎన్ని యుగాలైనది.

చక్రివాకము

ఎన్ని యుగాలైనది! ఇంత కాలం బ్రిదికి నందుకు ఇవ్వాళ సౌఖ్యం. ఆ సూర్యభగవానునికి నమస్కరించు సఖి. ఎంత పుణ్యాత్ముడో మనలను మళ్ళీ కూర్చినాడు.

చక్రివాకి

ఆ తండ్రి మనల నెప్పుడూ ఒక కంటితో చూస్తూ ఉంటాడు.

చక్రివాకము

ఈ గోదావరి ఇంత గోల పెట్టుతూ వుంది. ఎక్కడకు వెళ్లుతూ వుందో చూద్దాము పద. ఇదీ తన భర్తను చేరడానికి ఇంత తాపత్రయం పడుతూ ఉన్నట్లుంది.

చక్రివాకి

చూద్దాము పద

చక్రివాకము

కూ.. ...యి

చక్రివాకి

కూ.....యి.

# పూజాప్రసూనములు

రాలని పూలు కోసికొని రమ్మని పంపితి వీవె యీ యుషః
కాలము నందు పెద్ద రొయికి గట్టి ననున్; పవమాన వీచికా
జాలము లందు నే వలపుజాడల గట్టుచు వచ్చులోన ఈ
పూలవనమ్ము గుమ్మమును మూసిరి, పిల్చిన పల్కరెవ్వరున్

ఈ పథమందు వచ్చు జను లెల్ల రెగాదిగ నన్ను జూచి లో
లోపల నవ్వుచుండ నెటులో నిలుచుంటిని వేగుచీకటిన్
మాపులువడ్డ లేత పొగమంచు తెరల్ పులకించి పో, ఉషః
శ్రీ పవనమ్ము లెక్కి విహరించెడు పూవుల తావు లానుచున్.

ఆ రవికాంతి నీల జలదావళిపై బడ చిత్రవర్ణశో
భారమణీయతల్ దివిని వ్రాలిన పోలిక ఈ ప్రభాత గం
భీర సుగంధ శీతల సమీరము నా మెయి సోకినంత వి
ప్పారెను నా విషణ్ణ హృదయాన అపూర్వ విముగ్ధభావముల్

కాలము వెళ్ళబుచ్చి విధి కాళులపై తల మోపుకంటె నే
నేల స్వతంత్ర ధర్మము వహింపగ రాదని తోటపెన్గడిన్
కేలం స్పృశింప వింటి నొక కేకను "మాలికి గ్రుచ్చ నెంచు ప్రే
మాలను లీ వనిం జొర ననర్హులు వారల కంద వీ పువుల్"

శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

గాలి అడుగులు
కదిలితేనే
వేల గుండెల
బెదిరి పోతుంది
మా చిట్టి శ్యామల
దేనికొరకో

వెర్రి చూపుల
వెదకి చూస్తుంది,
ఇంతలోనే
బోసి నవ్వులు
వెళ్లబోస్తుంది
మా మనసు లోపల
ఎంత వెన్నెల
విరిగిపోతుంది

మళ్లీ యేదో
కళ్లు తిప్పి
కదిపి చూస్తుంది
ఆ
కళ్లలోనే
ఎంత వెలుగులు
వెలిగిపోతాయి
మా చిట్టి శ్యామల
ఇతరు లెవ్వరి
కంట బడనీ
కాంతి చూస్తుంది
మా
లోని వేవో
కలలు కదిపీ
వెలికి తీస్తుంది.

చిట్టిశ్యామల ముద్దు కృష్ణ

ప్రేయసీ! ప్రేయసీ!
ఓ యమావాస్యా త
మస్వినీ! గగనసీ
మంతినీ! నా సఖీ!
నీ దీర్ఘధమ్మిల్ల నీల వల్లీచ్ఛాయ
పొడిచికొని నిదుర చెర విడిచి పూవులు నేడు
మరుగు హృదయాల నా
కొరకు తళ తళ పాడు
సురభిళాహ్వానముల్
పరపి నన్గలచి దు
ర్భర దురంతావేగ
పరత వెర్రిని జేయు
నా సఖీ! నా సఖీ!.
నే సైపగా లేను!
నీ కైశిక ధ్వాంత నిశ్శబ్దముం జీల్చి
నా కొరకె, నా కొరకె, నా శర్వరీ సతీ!
కోటి నవమల్లికలు
కోటి కన్నులు విచ్చి
విరహ వీక్షణ భయం
కర మాధురుల నన్ను
పలుకరించిన చెలీ!
పులకరించిన బ్రతుకు
వేగిపోవునో యేమొ
ఆగలేనో యేమొ
నా సఖీ! నా సఖీ!
నే సైపగా లేను;
౫౬౩

నీ కుంతలములలో నాకై శిరసు లెత్తి
నను బోల్చుకొన్నవో ! నను బిల్చు చున్నవో !

నటియించు ఆ పూవు
లెటు నవ్వు చున్నవో
తురిమి విసరుము వాని
ఎరుగ నేరని దూర
దూరాలలో రహ
స్త్రీరాలలో చెలీ !
కప్పికొంమన కనుల
కప్పగలనా యెడద
నా సఖీ ! నా సఖీ !
నే సైపగా లేను ;

ఓ నిశాంత వియోగినీ ! ఓ నిశీథి
నీ ! కఠోర ప్రణయశాలినీ క్షమింపు
చాలు, నా సఖీ ! నీ ప్రేమ శాపమీ యి
పూర్వ నారక యాతనాఖర్వశాపము !

శ్రీ కృష్ణశాస్త్రి.

# ముక్కోటి

ఈ యేకాదశి నాఁటి వెన్నెల నట యే పుణ్యవన్యాశ్రమ
చ్ఛాయా శీతల వేది నస్ఖలిత వర్చశ్శ్రీలు పావిత్ర్యముల్
పూయున్ ఏ యతికన్య పాడు సరసంపుఁ సామగానమ్ములో
తీయమ్మైనదొ పూతభావనల తేనెల్ పూయు డెందమ్మునన్

శుచియై తీవ్రతపోవసాన నిరతిన్ శుభ్రాంగియై భావనా
నిచయాలన్ ఉమ గొల్చి నాథునకు తన్నీరాజనం బిచ్చి, చొ
క్కుచు క్రీగంటను జూచు నే పడుచు సిగ్గుల్ దేరు దృఙ్మాలికా
రుచు లందున్ దడబడ్డవో బయలు జారున్ లజ్జ నీ వెన్నెలల్

తెరచిన స్వర్గ పట్టణపు దివ్యకవాట ముఖమ్ములన్ పురం
దరసభ నందముల్ దొరగ దర్పక పుష్పరజంబులై మరు
త్తరుణులు లాస్యముల్ సలుప తన్మధురాంగ రుచిస్సుధానదుల్
తరగలు వారుటన్ బలుక బారెను నీ నడిరేయి కౌముదుల్

మధు మధురాధరల్ దివిజ మానిను లాత్మవయో విపర్యాసం
వదలను జాఱబెట్టు వలిపమ్ముల దాల్చి ప్రియాంక పాళి స
మ్మదము మదమ్ము దేర రతి మక్కువ లూరగ మోవు తీయ న
య్యధర రసాల నాని తడి యారవు ఈ ప్రణయార్ద్రచంద్రికల్

కాటూరి వెంకట నరసింగరావు — కవితా సమితి

ఈ వియోగ గీతిక లెపుడేని నా యు

భాగ్యవశమున నీకంట బడిన యేని

అవల ద్రోయుము నీకనర్హ్వాములు నకియ

వలపు టాకలి వేగి నా వలెనె మౌన

జీవితమ్ముల నొంటి గృశించు భగ్న

హృదయులకె కాని ఆటగా బ్రదుకు గడపి

కలత నెరుగని సౌఖ్యజీవులకు గాదు

ఈ విరహ గీతికలు శోకభావ భరము

లివి పఠించిన నీ చిన్ని యెద కలంగు

అవిరతానంద విలసితమ్మైన నీదు

జీవితమ్మున నను జింతసేయకుండు

టెరుగుదును. కాని గాటంపు మరపు తెరల

నడగిపోయిన నాదు నెయ్యంపు కతలు

ఈ విరహ శోక గీతి నాలించినంత

ఉలికిపడి లేచు మొరవు కత్తుల విధాన

అది నిశీథిని ప్రబల తీవ్రతపమ్ము
వలన క్షోభించి ప్రకృతి నిశ్చల సుషుప్తి
నవశ మైనట్టి వేళ—వియన్నదీ త
రంగ శిఖరాళి తుళ్ళింత లాపి యెగయు
శీతల తుషారములు నవజీవనమ్ము
గురియు కాలము. వాలిన కోమల ప్ర
సూన పల్లవరాజికై తేనె లొల్కు
జోలపాటల మెల్లగా నాలపించు
మందపవన కుమారికల్ మసలు వేళ

అది ప్రశాంత నిశాసమయమ్ము, అది హృ
దంతరాళములోని తుళ్ళింత లెల్ల
వెలికి విస్పష్టముగ వినిపించు వేళ
అది మనోహర తారకామృదుల గీత
రవ సుధాధార దివినుండి భువికి జారి
ప్రేమ పులకిత హృదయమ్ముగో మనోజ్ఞ
భావ ముదయింప జేయు శుభావసరము

అపుడు ప్రియరూప భావనాయత్త చేత
మవశమై వింత వింత యూహాలను దేల
మైమరపు జెంది ప్రేమైక మధురమూర్తి
నై యరయుచుంటి రమ్యదృశ్యమ్ముపోలె
చిత్రితమ్మైన ప్రేమ చరిత్రయెల్ల

కాలికిచెర్ల కృష్ణమూర్తి ఎం ఏ

# జన్మాంతరము

౧

నే నొక జీవినై పడి యనేక యుగాలు మనుష్యలోక జ
న్మానుభవమ్ము పొందితి వసంత సుఖోర్మ్మలలోఁ దుషారమం
దానిలకేళిలో హృదయ తామరస మ్మొక వేయి మారు లా
శా నవగంధముల్ విరియ జన్మపరంపర లోవరిల్లితిన్

---

ఒకయెడఁ దుంగ భంగ పవనోర్మ్ములఁ గొట్టుకుపోతి మాధుకే
ళిక విరిదేనెపానకము లేఁజివురాకుల పళ్ళెరాల జో
నుకొని దివస్సతుల్ పరిణయసూచి దరస్మిత మొల్కఁబోసి రా
సుకృత రహోమధూర్మి విపలుండ వదెక్కడి మానవుండనో

ఉత్తుంగాచలకూట విస్తృత దిశావ్యూహంబులోఁ గేళికా
యత్తమ్మై పయనమ్ము గట్ట నొకనా డాకీర్ణ ఘోరాంధ్య ని
ష్పత్తి వ్యంజిత కాలమేఘ జటిలాశాగర్త కాలుష్యమం
దొత్తెన్ వైద్యుత దంష్ట్రికా హసిత మృత్యుక్రీడనోద్వేగముల్

ఒక తరితీపి వెన్నెలల నొక్క పదమ్మున స్వర్గమెక్కి యిం
కొక దురదృష్ట వాయువలయోదయ మందు పదచ్యుతుండనై
సకల సుఖాసుఖమ్ముల విషాదపు స్వప్నము లభ్యసించితిన్

౨

నే నిక నూహాలే బ్రతుకు నేరుపు గాఁగ నుపన్యసింతు మం
దానిలబాలు డాసిన సుతారపు పల్కులు, కన్నెమబ్బు నీ
లైన రహస్సుఖపరిణయరాగము, కల్వల కొండగాని హా
సాను మితార్థముల్, విలయమందలి సృష్టిరహస్య వేదనల్

జన్మాంతరము

5. అమృతపయోధిలో జనన మందెద, శంభు శిరోధృత ప్రసూ
న మధుర మూర్తినై కలికి నవ్వుల చక్కిలిగింత పెట్ట మో
హము పడెదన్, రణన్నవనవాగత పారభృతీవియోగ రా
గములకు గుస్తరించెద వికస్వర జీవనలోకచారిణై

6. ఊహల లోననే బ్రతుకు నొందితి, యూహలె పెంచె వానిలో
నే హరిదంత గోళముల నిద్దురవోతి, తదీయ భావనా
వ్యాహృతు లొల్కు కిన్నరల ప్రియవు తేనెకరుళ్ల రాగిణీ
వ్యూహము లందు చిక్కువడి పోయి పరాజయమే వరించెదన్

3

8. నా గత జన్మ జీవన ధనమ్ములు ముచ్చిలి కాలచోరు డీ
లాగున వెంబడించెడు దలంపుల కందని యాసతాళ్ళ బె
న్వాగుర మోహపెట్టెను, ఝణంఝణ కంకణ కింకిణీ స్వరా
భోగవు తాండవమ్ము లెగబోసి హతాశుని మోసగించెదన్

పెనుమర్తి వెంకటరత్నము

# లీలాకమల

౧

అల్పజీవిని నా హృదయమున మెరపు
వెంబడి మెరపు వచ్చు వేళ తరచి
తరచి మాయమైనది. ఒక తరుణరేఖ
నెట్లో సుళువుగ బట్టి బంధించినాను

ఆ ప్రభాసీమలో జీవమైన తీవ
నీడల పరిమళాలలో నిలువు నిలువు
పులకరించుచు నొక చిన్ని పూవతలపు
మాటి మాటికి నటునిటు మసలుచుండు

ఇపుడు చిగురు సెజ్జ శయనింప జేతు
మృదుపరిమళ పవమాన విధూతాస
నాథములు సుమములు నీకు నవ్యభూష
లమర జేతు లోకముల్ విభ్రమము పొంద

౨

ఈ ఘటము నెత్తి నెత్తుక యేళు లెన్నొ
దాటి దట్టంపు కానలు దాటుకొనుచు
ఆ మహోన్నత శైల శృంగాగ్రమందు
కదలు నీకు నే నందింపగా వలె నని?

మార్గమధ్యంబు నందున మామకీన
భాండము వినిర్గతాంబువై పడెదు ననుము
నా శరీరము రక్తంపు నదులు కట్టి
నా శిరము వేయి తునకలై నలుగు ననుము

ఎంత నిర్దయ బుద్ధివో! ఈ నిశార్థ
భాగమున మేలుకొలిపితి భాండ మెత్త

కృష్ణం రామబ్రహ్మానందం

# ఫలశ్రుతి

తలిరు మెత్తని నీదు పాదములు కప్పి
నా పదమ్ములు చిన్ని నీ నవ మృణాళ
సదృశ కరములు మూసి హస్తములు నావి
అమృత పుష్ప సుగంధి నీ యాస్యసుమము
మద్గళమ్మున నిశ్వాస మధువు లూను
కొనగ నీ మూర్ధమును మూరుకొనుచు నేను

ఇట్లు బాహ్య పరిష్వంగ విస్మృతిని దేవి !
ఒదుగుకొని శయనించు నిన్ పొదువుకొని వి
లాస సుందర దివ్యలీల బదునాల్గు
భువనములు బొజ్జ లోన నిముడ్చుకొన్న
బాలకృష్ణుని రీతి నే పవ్వళింతు

నాయని సుబ్బారావు

*

మనమునకు మబ్బు ఎలిపమ్ము ముసుఁగుఁదాల్చి
కొండకోనలఁ బడి పాడుకొనుచుఁ బోవు
శిశిర శీతల పవమాన శిశువు నెత్తి
పెంచుకొన్నాను వంశి పూరించు కొఱకు

గగన గంగా తరంగిణీ కమల కోర
కముల తొలిపూఁత నాటి సింగారములకు
బాల భాస్కరు చాయలఁ బాలువోసి
తెనుఁగు తావుల వాసింపఁ దలచినాడ

తెనుఁగు తీయందనమ్ముల మునుము వట్టి
పాల వంటలఁ గోయు ప్రాభవము కలిమి
నీ భవమ్మున నాకు వాసించు గాని
ఎపుడు మొలకెత్తెనో యేమొ ! ఎవ్వఁడెఱుఁగు

పువ్వాడ శేషగిరిరావు — చోడవరపు జానకిరామయ్య

నేను పల్లెవాళ్ల కుర్రాణ్ణి బాబు
నన్ను కొట్టొద్దు తిట్టొద్దు బాబు
నేను పుట్టింది పూలపిల్లి పుంత
నే పెరిగింది పాలకొల్లు సంత
నేను ఏసింది ఏసిరాయి బాబు
నాకు పడ్డాది జెల్లకొంకు బాబు
నా పేరు రొయ్యపోతు బాబు
మా అమ్మపేరు యినకదొంతు బాబు
నా బాబుపేరు మట్టగిడస బాబు
మా అప్పపేరు సేసిపరిగి బాబు
మా తమ్ముడు పేరు సుట్టముక్క బాబు
మా అన్నపేరు జెల్లకొంకి. బాబు
నేను పల్లెవాళ్ల కుర్రాణ్ణి బాబు
నన్ను కొట్టొద్దు తిట్టొద్దు బాబు

(*) దీనా దీక్షితులుగారు ఒక జంగము దగ్గర వ్రాసికొనిన పాట)

# కాలపుటొఱపిడి

మరణమే లేక యుండిన, మానవునకుఁ
బూర్ణముగ జీవిత సుఖంబు బోధపడదు
అంధకారము లేకున్న నమృతకరుని
రాక కెవడు నిరీక్షించు రసపిపాస

స్వర్గమును దుఃఖహీన నివాస మటుల
సృష్టి చేసెను మతిలేని శిల్పి యెవడొ
చిటికె నైనను నైహిక జీవితంబు
వినిమయము సేయ నమరపట్టణము కొఱకు

కాంతిపోయిన యనివార్య కారణమున
రూపఱిన యట్లు లోకంబు చూపడియును
ఇంపె గొల్పును, గత జీవితంపు విలువ
యింత యంతని యనరాక హెచ్చు కతన

కాలవాహిని దొర్లుచుఁ గఱకు వాసి
నున్న నయ్యెను స్మృతియు; నింకొన్నటికిని
వివరములు గోచరింపవు: వినిమయార్థ
సక్తయౌ ప్రకృతి కళ కసాధ్య మెద్ది

ప్రాచి పువ్వులు విదలింపఁ బడఁతి కురుల
వాడు తావులు తారాడు పగిది, నిదుర
లేవఁ జిన్నారి కల తున్కలౌ విధాన
నెలత, నీ రూపు తలపు నున్నితము నొందె

కామినీ, నీవు యాథార్థ్య సీమ దాటి
గొనబు బంగారు కలలలో గుఱుతు పడవు !
దివ్య మీ నీ స్వరూపంపు దిక్కు జూప
నపరిమిత మూల్య మాసించె నయ్యొ ! ధాత

దువ్వూరి రామిరెడ్డి

# న్నెరసాని పాటలు

## ౫. గోదావరీ సంగమము

గాలి పిల్లలై పోయి వూదెనో
మొగిలు కన్నెలు పోయి చెప్పెనో
తగని కోరిక చేత తనలో కడలిరాజు
సాగను కిన్నెరసాని చూడాలె ననిపించి
ఉఱ్ఱట్లు లూగెనూ
మిఱ్ఱెక్కి చూచెనూ

మిసమిసని మింటికై పొంగెనూ
మునక మునకల కళ్లు విప్పెనూ
ఎంత దూరా నుందో యీ చిన్ని పడుచంచు
సంతోషమే మేను సకలమ్ముగా మారి
మిరిమిర్రి చూచెనూ
బొటవ్రేళ్ళ నిలచెనూ

ఉబికి కెరటా లూగు లాడెనూ
గుబురులై ఉప్పొంగి పోయెనూ
తనయొడ ల్తన కేమి తెలియన ట్లయిపోయి
తరుణి కిన్నెర అందమే లోక మయిపోయి
సళపెళా కాగెనూ
గలగలా వ్రాగెనూ

తన నీటిగుణ మెందు పోయెనో
తన చల్లదన మెందు దాగెనో
పరగ తనలో నున్న బడబాగ్ని శిఖ పొంగి
తన శరీరమ్మెల్ల దహియించి నట్లుగా
తటపటయి పోయెనూ
తపియించి పోయెనూ

గంగ తన యిల్లాలు కాదటే
యమున తన యిల్లాలు కాదటే
ఎంతమందీ లేరు ఇన్నియేళ్ళ్యా వచ్చి
చిన్నివాగును చూచి చిత్త మెరియించుకో
తనకు నిది తగదూ
కడలిరాజునకూ

ఏ నాటి ముసలి యీ కడలీ
ఏ నాటి పెద్ద యీ కడలీ
తిరిగి నలుగురి లోన తిరుగ నేర్చినవాడు
పరగ కామమునకై బడలిపోయె నటన్న
తనకేమి పరువూ
కడలిరాజునకూ

తన కున్న మరియాద యెంతా
తన కున్న గౌరవం బెంతా
లోకాలు తప్పు తోవల పోవునా యేని
సర్ది చెప్పగలట్టి సామంతు డీ రాజు
తానుగా దిగెనా
తప్పు దారులకూ

అన్నివాగుల వంటి దగునా
అన్ని తోగుల వంటి దగునా
మంచి కిన్నెరసాని మగని కెక్కిన చాన
కొంచె మేమో పొంది కోప మిట్లయినంత
తన్ను పొందునటే
తనకు దక్కునటే

వాగుగా తా నెప్పు డైనదో
తోగుగా తా నెప్పు డైనదో

జలజలా స్రవియించి బిలబిలా ప్రవహించి
కడలి రాజు హారంగు కౌగింటిలో దూరు
టపుడు వ్రాసినదీ
అన్ని వాగులకూ

అని పొంగిపోయెనూ కడలీ
అని వూగులాడెనూ కడలీ
తనపైన తారాడు పడవ లల్లల నాపి
వచ్చెనంచు తుపాను భయ మంది కుంవగా
తెరచాప లూగా
కెరటాలు క్రమ్మా

కెరటాలు పొంగినా కడలీ
తరగ లూగాడినా కడలీ
సాగను కిన్నరసాని చూపందుకొనుటకై
గగనమ్ము కొసదాక కెరటాలు వుబికించి
దూరాలు చూచెనూ
బారలూ చాచెనూ

పొంగిపోయిన కడలి చూచీ
మిన్ను ముట్టిన కడలి చూచీ
ఈ అకాలపు వేళ యేమో కడలి పొంగి
పోయెబో లోకాలు ముంచివేయునో అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

ఊగులాడిన కడలి చూచీ
ఉబికిపోయిన కడలి చూచీ
ఉప్పెనగా వచ్చి ఉర్వి అంతా పొంగి
తెప్పలై నేలపై తేలియాడునో అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

గిరి

అదు గదుగో బాడబము పొంగే
అదు గదుగో నేలపై వచ్చె
అని మానినులు పిరికి తనముగా చెప్పుకుని
మేనిలో ప్రాణాలు బిగియగా పట్టుకుని
కదలి పోయి రహో ఒక రోకరి
వదలి పోవ రహో

వచ్చి వచ్చి నటన్న కడలీ
పొంగి పొంగి నటన్న కడలీ
ఎంత చూచినను అట్లే నిల్చిపోవగా
ఎంత సేపటికి అట్లే నిల్చి ఉండగా
పిరికి తగ్గినదీ
జగము లన్నిటికీ

ఎట్లు పొంగిన దట్లు పొంగి
ఎట్లు నిల్చిన దట్లు నిల్చి
ఒక నీటిబొట్టైన ఉరలి నేలకు రాక
కడలి అచ్చోటనే కదల కుండుట చూచి
పిరికపోయినదీ
కొంత సేపటికీ

కడలి పొంగిన దంతె కానీ
కడలి ఉబికిన దంతె కానీ
కడలి తా చెలియలీ కట్టదాటునె యంచు
కడలి మాత్రము బద్దె గడచి పోవునె యంచు
కడగి యనుకొనిరీ
బడుత మానినులూ

అన్నివిధముల లోక మాడెనూ
అన్ని రీతుల జగము చెప్పెనూ
చిన్ని కిన్నెరసాని చిత్తాన పొగలెగయు
కొన్నిన్నివ్వకలు లోన కుమిలించి దహియించు

చెప్ప రెఖగుదురూ
ఏ వ్వేటి జనలూ

కడలి మిన్నుల తాకు చూచీ
కడలి తరగల ప్రాగు చూచీ
కడలి తన కోసమై బడలుపడి పోవు నని
కడలి తనపై వేపు కమ్ముకొని వచ్చె నని
కిన్నె రెరిగినదీ
కేము వలచినదీ

మనసులో పెద్ద దిగులుట్టీ
ఎదలోన పెద్ద వగ పుట్టీ
కదలి పోయెడి నీరు గడ్డ కట్టించుకో
సాగిపోయెడి నీరు సాగ కింకించుకో
బిట్టు కోరినదీ
బెట్టు కుందినదీ

ఓ నాథ నిను వీడి వచ్చి
ఓ రాజ నిను వీడి వచ్చి
నా యెడ ల్పాయితమ్ము నానాజనులు కోర
యీ యేపవుం బ్రిదు కేల పొందితినిరా
అంచు వగచినదీ
అంచు లురలినదీ

అచటనే నిలచి పో నెంచూ
అచటనే ఆగిపో నెంచూ
కాని నీటి గుణమ్ము కదలి పోవున గాని
చాన కిన్నెర కోర్కె సాగించునే తాను
జలజలా కదలీ
బిలబిలా కదలీ

రాయడ్డముగ చేసి నిలుచూ
పాదలడ్డముగ చేసి యూగూ

ఇంత నిల్చితి నంచు నొంచి లో నుప్పొంగి
పొంత పొంతల రాళ్లు పొదలు పై పై పొంగి
అడవి పరుగెత్తూ
అంతలో నేడ్చూ

* * *

హా యని కిన్నెర యేడ్చెన్
తన మనోహరుడు శిల యైనా డని
తా నేమో యీ వాగైనా నని
హా యని కిన్నెర యేడ్చెన్

ఊగు లాడు కెరటాలు నాపుకొన
సాగు లాడు తరగల్లు నిల్పుకొన
పారికి పోవు తన గుణము చంపుకొన
చాలక చాలక చాలక చాలక
హా యని......యేడ్చెన్

తన తొందరయునూ తన పతి ప్రేమయూ
తాను చేసినా తెలివి తక్కువయు
తన పతి చూపిన త్యాగ గౌరవము
తలచుకొని తలచుకొని బోరున బోరున
హా యని.........

ఏడుపు నిప్పుక లెగసి చిమ్ముకుని
ఏటి నీరములు నెండ గట్టుకుని
చేటు తప్పి పోయేటి రీతిగా
బాట యేల కనరాదని రాదని
హా యని.....

చుక్కనైతే యీ బెడద తప్పునే
మొక్కనైతే యీ వగపు తప్పునే
అక్కట నా చెలువుని దెస చేసిన
యిక్కలుషము నే దాటు టెట్టు లని
హా యని......

కడలి లోకముల నేలే రాజట
కడలి ధర్మములు నిలిపే దొర యట
కడు పతివ్రతల కవయ నెంచుటలు
కడలికి తగునా తగునా యిట్లని
హా యని......

అతడు మంచివాడే యగునేమో
సతి వాగ్ని ప్రవహించిన దంచన
అతని కోసమే అయిన దటంచును
మతి తలపోయుట తప్పెట్లగు నని
హా యని

పచ్చి పచ్చి జలమెల్ల నెల్లనయి
పచ్చి పచ్చి తనువెల్ల నల్లనయి
పచ్చి పచ్చి నురుసుల్లు తెల్లనయి
పచ్చి పచ్చి కడకల్లు వేగమయి
హా యని......

బొట్టు బొట్టు కొక వేయి మొదలుగా
తరగ తరగ కొక వేయి నోళ్లుగా
బడలి నీరమే యేడుపు మయమై
కడలి మోత లెక్కుడు భయ మిడగా
హా యని......

గాలి పొరలలో కదలాడినవో
అడవి చెట్లలో అణగారినవో
వెలుగు దారులను విచ్చి చొచ్చినవో
కిన్నెర యేడుపు సన్నని మెలుగులు
హా యని......

కిన్నెర యేడుపు సన్నని మెలుగులు
విన్న యడవిలో చిన్ని పులుగు గమి
కిన్నెరతో పాటుగ గొంతులలో నన
సన్నని యేడ్పులు జాలు వార్చగా
హా యని......

శిలయైన పతిం దలచిన గాలులు
మెలమెల్లగ తన తరగల నూగగ
చలచల్లన ప్రాణమ్ములు తేరగ
తలచిన కొలంది దుఃఖము పొంగగ

హా యని......

క్రొత్త వాగు పరతెంచి వచ్చెనని
క్రొత్త తోగు పరతెంచి వచ్చెనని
క్రొత్తక్రొత్త యాంబాల నీరములు
క్రోలగ వచ్చిన పులులు దిగుల్పడ

హా యని......

ఎక్కడెక్కడీ మృగములు వచ్చెను
ఎక్కడెక్కడీ పులుగులు వచ్చెను
ఎక్కడెక్కడీ గాలులు వచ్చెను
కిన్నర నోదార్పుటకై పాపము

హా యని......

కిన్నర యేడుపు చూచి పులుగులూ
కిన్నెర దుఃఖము చూచి మృగములూ
కిన్నర యేడుపు చూచి గాలులూ
ఓదార్పగ లేకవియు నేడ్చెనూ

హా యని......

చూడ వచ్చినా లేశి, కిన్నెరా
గాసివారినా యెడద లోపలా
వాసి వాసి లేజివురు వత్తులై
బేసిన కన్నుల నీరము వెట్టగ

హా యని......

ఒడ్డు నందు కుందేటి కూన లవి
చిన్ని చెవులు తెగ నిక్కపొడుచుకొని
ముందు కాళ్ళు లింపొంద నెత్తి రూ
ఢార్ప్యలేక తెలతెల్లవోవగా

హా యని......

గూళ్ళలోన తమ పిల్లల వదలెను
మేతకొరకు పోవాలని మానెను
అడవి పులుగు లల్లల్ల చేరుకుని
అడవి వాగు నోదార్చ వచ్చెనూ
హా యని

పికిలి పిట్టలూ అడవి పిచ్చికలు
నీటిపులుగులూ, నేలపులుగులూ
తెగ గుమిగట్టిన తెలుగుపిట్టలం
వొకటి యేస్తే మఱి యొకటి యేడ్వదా
హా యని.....

కిన్నెర యేడుపు సన్నని యెలుగులు
మిన్ను మన్ను నడిమెడము నెడమునా
చిన్ని వెలుగులో పిన్నగాలిలో
సన్న సన్నగా జాలువారగా
హా యని.....

చిన్నికిన్నెరా సన్నని యెలుగులు
పిన్నగాలి కెరటాలు చొచ్చెనూ
ఎన్నడో వెనకటి బ్రతుకున మిక్కిలి
విన్న పాట వలె విరవిర బోవును
హా యని.....

చిన్నికిన్నెరా సన్నని యెలుగులు
చిన్ని చెట్ల కొరింజివురు లంటెనూ
ఎన్న నందనము గున్నమావులం
మున్న తుమ్మెదల రొద వలె మొరయును
హా యని.....

పడతికిన్నెరా పిన్నని యెలుగులు
అడవి పచ్చికల యందున పాకును
అడవిపావురా యెడబా టగ్గికి
గుడగుడ గొంతున కూసిన యట్లగు
హా యని.....

అల్ల నల్ల కిన్నెర యేడుపు లవి
వెల్లివిరిసి గోదావరి కెరటము
లల్లలాడు నా నడిమి సందులో
మెల్లగ దూరెను మొసలిడు పోలిక
హా యని......

అల్లనల్ల కిన్నెర యేడుపు లవి
మెల్ల మెల్ల గోదావరి గర్భము
వెల్లిలోన చొరబారి మొత్తుకుని
గొల్లు మనుచు మొగపెట్టుకొన్న యవి
హా యని......

గోదావరి యీ వార్త విన్నదీ
గోదావరి నది గుండె కరగినది
గోదావరి నది జాలి పొందినది
గోదావరి కన్నీరు కార్చినది
హా యని......

గోదావరి నది పొంగివచ్చినది
గోదావరి తా నభయ మిచ్చినది
గోదావరి కెరటాలు చాచినది
గోదావరి రమ్మన్నది కిన్నెర
హా యని......

కిన్నెర యెదలో పొంగిపోయినది
కిన్నెర యెదలో తాండవించినది
కిన్నెర మరి కన్నీరు కార్చినది
కిన్నెర తన కత చెప్పుకున్నదీ
హా యని......

కిన్నెర తన కెరటాలు తగ్గినది
కిన్నెర తన యూగిసల నాపినది
కిన్నెర గోదావరి కెరటాలకు
చిన్ని యలలు తా నంది యిచ్చినది హా యని...

* * *

గోదావరీ దేవి గుండె జల జల లాడి
ఆపగాని మనసు కదలాడీ, జాలి
పాదులో పిల్లగిలి వ్రాడీ, కిన్నెరా
గేదంగి తెల్లరేకెత్తు క్రొత్తరగలో
చాదుకొని పెను తరగ లూగీ, ఆ వాగు
నాదుకొని యూమె వగపాగీ

గోదావరీ జాలి గుండె గూడులు కదలి
పాదు కిన్నెర కెదురు పోయీ, ఆమె
లో దిగులు తరగ చేదోయీ, వారించి
ఆదరముచే నామె నదిమి కౌగిట బూని
ఏది నీ మొగము నా తల్లీ, అన్నదీ
నీ దిగులు నిక మాను చెల్లీ

గోదావరీ పేద గుండె లోతులు కలసి
రా దగ్గరకు రమ్మ తల్లీ, ఎంత
పాదువే నా ముద్దు చెల్లీ, నీ వెన్క
రా దగని కష్టాల రాశి మ్రగ్గితివమ్మ
నీదు పతి శిల రూపు పొందీ, నీ వేము
ఓదె పవ వాగుగా చిందీ

గోదావరీ జాలి గుండె పేగులు తరిసి
నీ దుఃఖ మెంతదో తల్లీ, నన్ను
నాదరువుగా నమ్మ చెల్లీ, నిను చూచి
కేదలై, లోకాలు పెద్దలె యేలేటి
శ్రీదులే మతి చెడిరి తల్లీ, నీ యేడ్పు
రోదసిని నింపినది చెల్లీ

గోదావరీ మెడద కోసలను కోతపడి
రా దగరకు రమ్మ తల్లీ, కడలి
జోదింక నిను కనదు చెల్లీ, నాతల్లి

నాదు గర్భమున నిన్నాదుకుని ఉంటాను
నీదు నెగులును పోవ చూడూ, కడలి
నీదు జోలికి ఇంక రాదూ?

గోదావరీ దేవి కోస మనసులో నొరసి
ఏది నీ యొడలు నా తల్లీ, చేర్చు
నాదు కౌగింటిలో చెల్లీ, తల్లి నీ
లేదలిరు కెరటాలు నాదు కాల్వల నింతు
నీదు బొట్టును కడలి కనదూ, నా తల్లి
నీదు సంగతి కడలి వినదూ

గోదావరీ మహాకూలంకషామృత
శ్రీ దివ్య మధు తరంగాలూ, చిన్ని
సాను కిన్నెర తరంగాలూ, కలసికొని
ప్రోదిగొను గంగా సరస్వతుల నీరములు
చాదుకొను తళుకు లురలించే, చూడగా
పైదోడు తనము మెరిపించే

గోదావరీ దేవి కోస తళుకు ముత్తెముల
నూదిరి సెలంగు కెరటాలూ, చిన్ని
సాదుకిన్నెర తరంగాలూ, కలసికొని
లే దళుకు వెన్నెలలలో తలిరుమల్లికల
మూదలించిన యట్లు వొలిచే, అవ్వాని
పాదలించిన యట్లు వలచే

గోదావరీ దేవి కొరగించే మొగలి
వాదర హారంగు కెరటాలూ, చిన్ని
సాదుకిన్నెర తరంగాలూ, కలసికొని
గోదుమల వన్నె తెలి కొత్త మబ్బుల జంట
ఊది కలసిన యట్లు పొలిచే, అందాల
గాదిలి కవుంగిళులు మలచే

గోదావరీదేవి కోలు మసగే సన్న
నాదు సేసే తరంగాలూ, చిన్ని
నాదు కిన్నెర తరంగాలూ, కలసికొని
వీదిలో పెద్దక్క చిన్నక్క నవ్వుల్ల
బోదె లోదిగిన యట్లు పోలిచే, రతనాల
బాను లుంచిన యట్లు పోలిచే

గోదావరీదేవి గునిసియాడే మీను
లీదులాడే తరంగాలూ, చిన్ని
నాదు కిన్నెర తరంగాలూ, కలసికొని
మీది పయ్యాలలో మిసమిసను పసిపాప
మాదిరిగ కలసికొని వొలిచే, నునుకాంతి
మేమరిముత్తై వెలుగు మెలిచే

గోదావరీ దేవి కోరి కిన్నెరసాని
నాది తనలో కలుపుకొనెనూ, నీటి
పాదులో గుచ్చెత్తుకొనెనూ, ప్రేమతో
నా దేవి యా చాన మోదాన కెరటాలు
నాదుసిరము కూచుకొనిరీ, కోమలాం
భోజముల వలె మొరనుకొసిరీ

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
నాది తనలో కల్పుకోగా, కడలి
పాదుకోరిక పిల్లగిలగా, కోపాన
ఆ దేవి నడలించ నాలోచనము సేయు
కాదంచు మదిలోన నెంచూ, మనసులో
వాదించు రంగు చెము నంచూ

గోదావరీదేవి గొప్ప వంశపు రాణి
కాదనేందుకు వీలు లేదూ, ఆమె
కాదన్న పని సేయరాదూ, అందులో
పది తన దెస న్యాయమే దారి నా దేవి

కాదన్న పని మంచి దనునూ, లోకాలు
వాదించితే మెప్పు గనునూ

గోదావరీ దేవి గొప్పగుణముల దాన
వాదు పొందే పనుల రాదూ, న్యాయ
మే దారి విడి యెందు పోదూ, అందులో
ఆ దేవి మున్న సీతారాము లొకరొకరి
నేమకొను నెడబాటు నెరుగూ, పరుల క
ష్టాదులకు మదిలోన మరుగూ

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
సాని తనలో కలుపు కొన్నా, కడలి
యేది చేయగ లేక యున్నా, అంకరూ
ఓ ద్రోగా నీ కిట్టి లీ దిగులు కాదయా
కాను పవిత్రులను కోరా, ఆ వాగు
పేదరా లది నీకు మేరా

గోదావరీదేవి కొను సప్తఋషుల వి
ప్రాది వాహిని తప్పకోదూ, తప్ప
నెదునే గాసి కైకోదూ, నీవు సి
గ్గేది కోపింతువా యే మొగము పెట్టుకుని
పోదు వా దేవి కడ కింకా, ఏ రీతి
నా దేవి కోటి మాన్తు వింకా

గోదావరీ దేవి గూడి కిన్నెరసాని
సైదోడుగా మారి నంతా, కోర్కె
కే దారి మాయ మయి నంతా, తన పొంగు
న్మా దించుకొని కడలి లో దించుకొని కడలి
మీది పొంగు కుదించు కొనెనూ, లోలోన
నాదుగా తెగ మొరసికొనెనూ

గోదావరీ నీరు కూడి కిన్నెరనీరు
ఏది యేదో తెలియనంతా, కోర్కె

కే దారి మాయ మయినంతా, తొల్లింటి
పాదు మాపటు పొంది సాగి చెలియలికట్ట
కేదో మెలమెల్లగా చెప్పూ, పడవేకు
పోదారిగా నీర మొప్పూ

గోదావరీదేవి కూచి కిన్నరసాని
యే దిగులు లేక తెలివొందే, చల్ల
పాదు తరగల గుములు చిందే, మనిసిగా
నే దారినో చచ్చుటగదా మరి యిప్డు
లేను చావో తనకు నైనా, అనుకొంది
లేదు చావును మగనికైనా

* *

మాన్ప్వలో తెల్లనై తోచిన దుమ్ముకాంతి
తొలిమావి లే బూకె దూసెను పికీకాంత
తలలపై రతనాలు తళతళా మెరిసేటి
నల్ల తాచులు దూకి నాట్య మాడేటట్లు
మెరసింది కిన్నెరా, ఒడ్డులు
ఒరసింది కిన్నెరా

పొంకమ్ము తెలికొంద పాడిచింది క్రొంబాదు
మేల్కాను మొగలతో మొలగినదడవి సద్దు
పసవు బట్టలు ఆర పట్టగా నేలపై
గాలి లే బారలలో కదలు లాగిన యట్లు
కదలింది కిన్నెరా, కాంతితో
మెదలింది కిన్నెరా

పొద్దెక్కు గాలిలో పుట్టింది చిలువెట్ట
పొదల బుర్రి మని కూసింది కోమటి పిట్ట
రేల చెట్టాకుల్ల రాలి క్రొత్త చివుళ్లు
తొడిగి లే మొండెం త్రోవ దూకినయట్లు

పొలిచింది కిన్నెరా, తెలుపుల్లు
మలచింది కిన్నెరా

జాము జామున్నర సాగెను చదల పొద్దు
నెమలి కూతలతోడ నిండిన దడవి సద్దు
తరగ విరిగిన చోట తరణి కాంతులు ప్రబ్బి
గాజు ముక్కలు సూర్యకాంతి మండిన యట్లు
పొదలింది కిన్నెరా, అందాలు
వదలింది కిన్నెరా

మిగుల తా నసి మింట మొరసి మండెను తరణి
నెగడె కాంతారమ్ము నిశ్శబ్ద మగు కరణి
మరకతమ్ములు నేల పరచగా పడ్డట్లు
పాకటాకుల మీద పసిమి యూదిన యట్లు
నడచింది కిన్నెరా, సొగసుల్లు
ముడిచింది కిన్నెరా.

మూడు జాముల పొద్దు మొగి జారినది మింట
వెనుక పట్టెను తమ్మి విరి మే ల్వాలవు పంట
కళ్లమ్ము తుసిది పంసిన గోదుముల కుప్ప
తూర్పు గాలులకు తూర్పార పట్టిన యట్లు
జారింది కిన్నెరా, పైశీగా
మారింది కిన్నెరా

మూరగా బారగా పొద్దు వాటారింది
పొలము పిచ్చిక గుంపు పురుగు మేతేరింది
అడవి చెట్టుల నీడ లవఘుళించిన నీరు
పలువు తిరిగిన పైరు నాట్యమాడిన యట్లు
తరలింది కిన్నెరా, తరగల్లు
ఉరలింది కిన్నెరా

'కొండ దగ్గరనగా క్రుంకింది ముదిపొద్దు
మింట వచ్చెను పిట్ట గముల రెక్కల సద్దు

అడవిలో బోయ వేటాడి నట్టి మృగాల
తోడునులం బసి నల్ల తోగువారిన యట్లు
నడచింది కిన్నెరా, రంగుల్లు
ముడిచింది కిన్నెరా

నల్లగా రేచాన నడచింది తొలిజాము
గొల్లుగా బొబ్బలిడ కొల్వులుల్ పెనుదీము
దొడ్డదొర ముంగిళ్ళ తోరణాలుగ వ్రేలు
హరినీల మణుల కాంతులు ప్రబ్బినట్లుగా
మారింది కిన్నెరా, ఊటలై
ఊరింది కిన్నెరా

నడిరేయి నల్లనై నాట్యమాడిన దడవి
వెసి పులుల్ మృగముల వెదకి చంపెను తడవి
నీరు సాగునా యేమి నీరు కన్పడరాక
తరగ సవ్వడి మాత్రి గురుతు పట్టునట్లు
పోయింది కిన్నెరా, సలుపులా
చేయుంది కిన్నెరా

శుక్ల పక్షము వచ్చె చూచు చుండగ మింట
శోభిల్లె చిన్ని జాబిల్లి తారలజంట
తెచ్చి మణులుగ చాదీ వెండి కంసాలి
మూసలో కరిగించి పోసిన యట్లుగా
ఆడింది కిన్నెరా, తళతళ
లాడింది కిన్నెరా

* * *

తలిరాకు తుంచ దక్కె తారెను వసంతమ్ము
కోకిలో ర్చెను నెమలి కూతలకు పంతమ్ము
మగని పేరెడబాటు పొగల సగమయి పోయి
బవాలు సన్నగిలిపోయి పాలిపోయిన మేన
మెరసింది కిన్నెరా, ఎదలోన
మొరసింది కిన్నెరా

ఎడనీరు కాల్వలై యేరులై పోవు కై
వడి మృగమ్ములు దప్పికలు తీర్చుకొను రీతి
సాగింది కిన్నెరా, బూది రం
కూడింది కిన్నెరా

మండు టెండలు గాసి మాడ్చినది గ్రీష్మమ్ము
కొండ యంచుల నుండి కురిసినది ఊష్మమ్ము
నీటి పుట్టము తొలగి నిలువెల్ల నిప్పులో
యేటి యిసుకలు మండి మొగసిపడి పోవగా
ఏడ్చింది కిన్నెరా, తను వెల్ల
మాడ్చింది కిన్నెరా

అడవిలో చిఱువూట యట్లుగా కదలాడి
పాలలో కలిపిన పంచదార విధాన
రుచి హెచ్చె కిన్నెరా, సితమణి
చ్ఛవి గ్రుచ్చె కిన్నెరా

వడగళ్ళతో వచ్చి పడె వాన కాలమ్ము
పుడమి పచ్చికలతో పొంగెను సస్యమ్ము
పతి గుట్ట మొగిలు తోడున క్రుమ్మరించిన
అతి ప్రేమవారి దేహమ్మెల్ల నిండగా
ముడిసింది కిన్నెరా, అందాలు
తడిసింది కిన్నెరా

సలగఁ గొట్టిన పంగనామాల చెరుకులో
నలి బూదెరంగు పానకము జారిన యట్లు
ఒడిచింది కిన్నెరా, సల్లనై
నడచింది కిన్నెరా

అంచ రెక్కలతోడ నరుగుదెంచె శరత్తు
పంచలందున తెల్పు పడె కొంచెము సరిత్తు
మొదలి పొంగులు పోయి పోనుపో స్వచ్ఛమై
తేరుకొన్న మనోహరుని ప్రేమపోలిక

కదలింది కిన్నెరా, కెరటాలు
మెదలింది కిన్నెరా

బంగారు తీగలో పాలకమ్మును బోలె
మరియు చిక్కనగాక మరియు పల్చనగాక
తరలింది కిన్నెరా, వడ్డరం
గురలింది కిన్నెరా

దళదిళల్ మంచులో తేలించుకొని కాగు
తెల్లనై తరగల్లు తేలించుకొని నేలు
రాణివాసము వోల్చు రమణి మేల్ముసుగులో
వెండి తీగ వితాన వెలిగిపోయెడు నట్లు
వెలిగింది కిన్నెరా, దారిలో
మలగింది కిన్నెరా

శైవాభిషేక రంజన్నారికేళ గ
ర్భాంబువుల్ వాకలై అడవి పారిన యట్లు
కదిలింది కిన్నెరా, ముత్యాలు
వదలింది కిన్నెరా

శిశిరాగమము వచ్చి చెట్ల యాకులు దూసె
ముసలులై జంతువులు ముడుచుకొని కన్మూసె
పతి ప్రేమ చూరాడి బహుళా ననుభవించి
పొలతి దేహమ్మెల్ల ముడుతల్లు పడ్డట్లు
పొలిచింది కిన్నెరా, నలుకడల్
వలచింది కిన్నెరా

రాలి యెండిన యాకు లోలిపడి నీరముల్
మాగి యెర్రని క్రొత్త మధువు కాలువ యట్లు
తోచింది కిన్నెరా, యెర్రనై
యేచింది కిన్నెరా

ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా
కాగుకాగున మారు కాంతిలో కిన్నెరా

తెలుగు సత్కవిరాజు పలు కందుకో లేని
భావులూరి చవులూరి జలములై పొర్లివలై
కదిలేను కిన్నెరా
సాగేను కిన్నెరా

తెలుగు దైవమ్మై భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతని దర్శనము చేసే త్రోవ
కాచింది కిన్నెరా
తెలుగు యాత్రికుల కందిచ్చు చల్లని నీడ
పుణ్యాత్మ కిన్నెరా
తెలుగు యాత్రికుల కందిచ్చు చల్లని నీరు
పూతాత్మ కిన్నెరా
తెలుగు దైవమ్మై భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతని దర్శనము చేసే త్రోవ
కాచింది కిన్నెరా

విశ్వనాథ సత్యనారాయణ

కిన్నెరసాని పాటలు అథుహ

# శ్రీకృష్ణ రాయబారము

( ౫వ సంచిక తరువాయి )

ఉన్నవ లక్ష్మీనారాయణగారు

కృష్ణుడు కుశస్థలంలో దిగాడని కౌరవులకు కబురు వచ్చింది. ధృతరాష్ట్ర చక్రవర్తి యొక్క మనోవృత్తులు మనం గమనింతాం. సంజయ రాయబార మయిన తరువాత వ్యాసుడు ధృతరాష్ట్రుడికి ప్రత్యక్ష మయి అధ్యాత్మ తత్వం బోధించి వాసుదేవు నాశ్రయించి మన వలసిన దనీ ఆతని ననుకూలించిన వారికి విజయము కలుగుననీ ప్రతికూలించిన వారు నశింతురనీ చెప్పి పోయినాడు. కొడు కెట్లాగూ కృష్ణుని మాటలు వినడు గనుక డబ్బు దనక మిచ్చి అతని స్వాధీన పరుచుకుందా మని యోచిస్తూన్నాడు. చక్రవర్తి యొక్క ఈ యోగ్యతకూ హ్రస్వదృష్టికీ అసమర్థతకూ విదురుడు కోపించి చీవాట్లు పెట్టాడు. మొత్తము మీద సభ వారందరూ కలసి కృష్ణునికి బ్రహ్మాండ మయిన మర్యాదలతో ఆహ్వాన మియ్యడానికి ఉద్దేశించారు. "నీవు నాకు దగ్గర చుట్టానవు. ఉభయ పక్షములకు కావలసిన వాడవు. మహానుభావుడవు. పిల్లవాడు దుర్మార్గుడు. మన మాట వినక పోయె. నే నేమి చేసేది. వాడు దుర్మార్గు డని నీవు క్షయం చేస్తావా. ఏదో సర్ది యుద్ధం రాకుండా చెయ్యి. నాకు పెద్దతనంలో దుఃఖం తెచ్చిపెట్టవద్దు" అని అడిగే పద్ధతిమీద ధృతరాష్ట్రుడు పోదలుచు కున్నాడు. కృష్ణునికి ఆహ్వాన మియ్యడములో ఇతనికి గల యుద్దేశ మిదే. విదుర భీష్మ ద్రోణ కృప బాహ్లికాదులు కృష్ణుని యందలి భక్తి చేత ఆహ్వాన మిస్తున్నారు. ఇక దుర్యోధ నాదులు కృష్ణునితో స్నేహము నటించి నమ్మించి వలలో బడదోసి పట్టి బంధించవలె నను ఉద్దేశముతో ఆహ్వాన మిస్తున్నారు. కృష్ణుడు కుశస్థలంలో నుండగనే దుర్యోధనుడందరి యెదుటా సభలో నీవిషయం చెప్పివేశాడు. వెఱ్ఱి వెధవా ఇట్టి పనులు చేయకు మని ధృతరాష్ట్రు

డప్పుడే చీవాట్లు పెట్టాడు గాని నిజముగా అన్నంత పని చేస్తాడని నమ్మలేదు. ధృతరాష్ట్రుడిట్లా దుర్యోధనుడట్లా పెద్ద ఆహ్వానం ఏర్పాటు చేశారు. పెద్దలందరూ తమ యిండ్లకు రమ్మని పిలువ నంపించారు. వృకస్థలం నుంచే మనుష్యుల నెదుర్కొన బంపి భోజ్యములు మొదలైన ఏర్పాట్లు చేశారు. హస్తినాపుర మంతా వేడుకలు చేసి కృష్ణుని చూడడానికి పొరబడి వచ్చారు. కృష్ణుడు రావడం ధృతరాష్ట్రుడింటికి వచ్చాడు. పెద్దలంతా అచ్చటనే సమావేశమయినారు. ఉభయ పక్షములా కుశల ప్రశ్నలు జరిగినవి. అర్ఘ్యపాద్యాదు లిచ్చారు. అంతట శౌరి వ్యవహార సంభాషణలు జరుగక పూర్వము విదురు నడిగి అప్పటి నిజ పరిస్థితులు తెలిసికొనటకూ కుంతి అభిప్రాయము దీసికొనుటకూ నిశ్చయించుకొని విదురాదులను చూచి వస్తానని లేచాడు. అప్పటి కాయన భోజన మచ్చట జేయునని వని గ్రహింప రాలేదు. కాని రాజబంధువుగ నెంచి దుర్యోధనుని నగరులోనే ఏర్పాట్లు చేసినట్లు తెలుస్తుంది. సామాన్యపు రాయబారికి వలె ప్రత్యేకపు ఏర్పాట్లు చేయలేదు. కాని కృష్ణుడు వీరెవరి యిండ్లలోను భుజించ దలచ లేదు. మొదటి నుంచి నిష్ఠ గలిగి పని తోనే సంచరిస్తున్నాడు. స్వరక్షణ అవసరమని యెంచి కత్తి కటారులు వెంట దెచ్చుకున్నాడు. వృకస్థలంలో కౌరవులు చేయించిన వంటలు స్వీకరించినట్లు నటించాడు గాని భుజించ లేదు. స్వంత వంటకమే చేయించుకున్నాడు. ధృతరాష్ట్రుని నగరు నుంచి బయలుదేరి విదురు నింటికిబోయి కుశల ప్రశ్నంబులు జరిగిన వెనుక విదురుని కోరికపై భోజన మాయన యింటనే జరుపుటకు నిశ్చయించి యట నుంచి కుంతి యింటికి బయలుదేరి యామె ననునయించి యచ్చోటు విడచి దుర్యోధను నింటికిం బోయినాడు. పెద్దలందరు నచ్చట సభ దీరి యున్నారు. శాస్త్ర మర్యాదల నచ్చట గ్రహించిన వెనుక మధుర సంభాషణములు సాగినవి. అంతట

దుర్యోధనుడు:- తమకు ప్రియమయిన శాకపాకము లేవి సంసిద్ధము చేయించేది.

కృష్ణుడు:- నే నిచ్చట భుజించ దలచ లేదు.

X—X

దుర్యో:-(కర్ణునితో) విన్నావా ? కృష్ణుని మాట లెంత సరసముగా నున్నవో! కారణ మడిగి యాయన పెద్దతనము బయలు పెట్టు దాము. (కృష్ణునితో) తమరు వస్తున్నారని యెంతో ఆనంద పడి యథాశక్తిగా అన్నపానములు మేమిక్కడ సిద్ధము చేయిస్తే మీరు మఱి యొకచోటికి బోవడము మన బంధుత్వమునకును నీతికిని బాహ్యము. మీరు మాకును పాండవులకును సమాన బంధువులే గదా. మా తండ్రికి మిక్కిలి యిష్టుడవు. సర్వ ధర్మములును దెలిసినవాడవు. నీ విట్లు చేయుటకు కారణ మేమి?

కృ:- శాస్త్రప్రకారము దూతలు ముందుగా ఎదిరింట భుజించుట గాని, వస్త్రాద్యలంకారములు స్వీకరించుట గాని న్యాయము గాదు. పని ముగిసిన వెనుక అన్నియుం జేయవచ్చును.

దుర్యో:- కార్యమునకై యింత తొందరేమి. అది నెరవేర నిమ్ము, నెరవేరక పోనిమ్ము. వ్యవహారము సంగతి వచ్చినప్పు డాలోచించుకొన వచ్చును. ఇట్లు ముందుగా మంగదాటికి కాలికి బంధించి వత్తిడి కలిగించు కొందుకు. మాతో పనిమీద వచ్చిన వాడవు చక్కగా మాయింట భుజించి సావకాశముగా మాట్లాడుకొని పనులు నెరవేర్చుకొన వలయునుగాని యీయావర్తనము నాకు సహేతుకముగ గన్పట్టుచుండలేదు. మీ యభిప్రాయమును మార్చుకొన వలసిన దని నా కోరిక.

కృ:- (చిరునవ్వుతో కరస్పర్శ గావించి) దుర్యోధనా! నేను భుజింప కుండుటకు కారణము నీవెరుగనట్లు మాట్లాడుతావేమి? నా నోట చెప్పించవలయు నని నీకు కోర్కె యున్నచో అట్టులే విను. ప్రేమతో పిలిచి పెట్టినదే కూడు. కానిది ఒంట బట్టదు. నీవు మాకు ప్రియుడవు గాదు. ఇప్పుడు వచ్చిన ఆపదయును లేదు. పగవారి చేతిభోజనము, అనుమానములకు చోటిస్తుంది. శరీరమునకే జబ్బు చేసినను భుజించిన దమృతమే యయినప్పటికి అనుమానములకు కారణ మవుతుంది.

నీవు నాకు ప్రాణమిత్రులయిన పాండవులకు విరోధివి గనుక నాకును విరోధివే. కనుక విదురు నింట భుజింప నిశ్చయించు కొంటిని.

దు:- సరే అట్లాగే కానియ్యండి.

భీష్మాదులు:- మీ మందరమును మా యిండ్లలో తమను సన్మానింప నిశ్చయించుకొన్నాము.

కృ:- తమ అందరి యిండ్లకును వచ్చి సన్మానముల స్వీకరించి నట్లుగనే భావించు కొంటాను! సెలవియ్యండి.

దుర్యోధనుడు మనసులో కృష్ణుని సన్మానించి లోబరచుకొన వలయునని గాని సాధ్యపడనిచో కట్టి వేయవలయు ననిగాని మనసులో నున్నను పైకెంత మాత్రమును కనుపడనీయక మర్యాదా పురస్సరము గా సంభాషించి నిజస్థితి తెలియని వారికి వాను దేవుడే తొందర పడినాడనిన్నీ కార్యవాదిగా వర్తింపలేదనిన్నీ తోచునట్లు వర్తించినాడు. కాని ఈ సంభాషణలో శౌరి యవలంబించిన నీతి వేరు. లాలించిన చో చెడుగు బిరుసెక్కు నని యెరిగి దోసిలొగ్గి సంధి వేడుకొనుటకు రాలేదనియు న్యాయమైన రాజీకే అంగీకరింతు ననియు తోపించుటకై బెట్టుగా వర్తించినాడు.

విదురు నింట కులాసాగా భోజనా లయినవి. తదుపరి విదురు డిష్టాగోష్టిలో సంధి యే మాత్రమును పొసగదనియు కౌరవులు సర్వనాశము దామే యనుభవింప వలయు నని యున్నారనియు తమకు తప్పక జయము కలుగుననే ధీమసతో నున్నారనియు చెప్పి నీ వచ్చు టికి పోవడము కూడ తనకు సమ్మతము గాదని తెలుపుట మూలమున అపాయము సహితము సంభవించు నని సూచించినాడు. అందుపై కృష్ణుడు సంధి పొసగ దనుట నిశ్చయమే యయినను ప్రయత్నిస్తే ఒక వేళ సంధి కుదిరేదేమో యను అనుమానము లేకుండ, రాజీకి ప్రయ త్నించలేదనే దూరు లేకుండ జేసికొనుట మేలనియు నీ వనినట్లు వారు తులువలై నా కహితము జేయదలంచినచో నాకు వారు చాలిన వారా యని నిశ్చయము తెలియ జెప్పిన మీద వుభయులు నిద్రలకు బోయి నారు.

ఉదయమున లేచి కాల్యముల దీర్చియుండగా దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులు నలువురును వచ్చి మురవైరిని సందర్శించి ప్రియోక్తు లాడి మహానుభావ మీ గొప్ప కార్యమునకు పూనుకొన్నా వని పొగడి, అంబికేయుడు సభ గావించి యున్నాడనియు అచ్చటికి రావలసిన దనియు ఆహ్వానించారు. రారాజు మంత్రి సహితముగా వచ్చి ఆహ్వానింప నవసరము లేదు తగు ఉద్యోగస్థుడువచ్చి ఆహ్వానించిన చాలును. క్రిందటిదినము మాధవుడు దుర్యోధను నింటికి వచ్చి యుండుటచే ప్రతిమర్యాదగా వచ్చి రనుకొన్నను వారు జూపిన వినయమునకును చెప్పిన ప్రియోక్తులకును చేసిన పొగడ్త కకును ఆవశ్యకత లేదు. వాస్తవ మయిన కారణము మరొక టుండి తీరాలె. ఏ విధముగ నయినను సంధి పొసగింపుకొనవలయు నను అభిప్రాయమే లేనందున శౌరి వలె బెట్టు జూప వలసిన పని లేదు. వినయముగా వర్తించ వలసిన ఆవశ్యకతయు లేదు. గొప్పవాడు రాయబారిగా వచ్చినందుకు మర్యాద గావింపవలె నను అభిప్రాయ మూ గాదు. పైగా క్రిందటి రోజున నాయన కఠిన వాక్యము లాడిన తరువాత నీ వినయము ఈ సారస్యము ఎందుకు వచ్చినవి. కీడుగాని వలవాల మాని కేశవుడు బెదరి రాయబారము విరమించి పోకుండ దుర్విసభకు తీసుకొని పోయి వీలు జూచి పట్టుకొనుటయే వారి యభిప్రాయము కావచ్చును. లేదా అనవసరముగ నారాయణునికి క్రోధము పుట్టింప కుండుటకై నను గావచ్చును.

నారాయణుడు సభకు పోయినాడు. చక్రవర్తిచే నాహ్వానింప బడి తనకై యుంచిన ఉన్నత మణి పీఠముపై కూర్చున్నాడు. దుశ్శాసనుడు స్వయముగా పీఠములు తెచ్చి పెట్టగా శౌరి కిరుపైపుల కృతవర్మ సాత్యకులు కూర్చున్నారు. విదురుడు వెనుక కుర్చి వేయించుకొని శ్రీహరిపీఠము మీద చేతులు పెట్టి కూర్చున్నాడు. అంతట ముకుందుడు జేసిన ఉపన్యాస సారాంశ మిది.

ధృతరాష్ట్ర మహారాజా! నీ వెరుగని సంగతులు లేవు. భరత వంశమునకు మేలొనగూర్పుటకై వచ్చాను. ఉభయులు కలిసి మెలిసి యుండు మార్గము యోచించి నడిపించు భారము నీది.

నీ వంశ గౌరవము నిలుపుము. కీర్తియును మేలైనను అనుభవించే వాడవు నీవు. నీకొడుకులు నీ మాట వినక యుద్ధమే పొసగినచో నీకూ నాకూ లోకమునకూ మహాపద రాక తప్పదు. ఈ కార్యము నీ చేతిలోనిది. నీవు చేయి కలగచేసితే నిజముగా నెరవేరుతుంది. ఇటు భీష్మ ద్రోణులతో అటు భీమార్జునులతో యుద్ధమున జయించుటకంటె అందరును నీ బంటులై యుండుట యెంతో మేలు. నీవు లోకము నంతను పాలింప గలవు. నీవు ఉపేక్ష చేసినట్లైతే లోకమున కాపద నిశ్చయము. కౌరవ పాండవులలో నెవరు నశించినను చివరకు నీకు దుఃఖమే. ఉభయ పక్షముల వారును పండితులే. పామరుల వలె కొట్లాడి చచ్చుట అక్రమము. ఉభయులను నీవు కాచి రక్షించుము.

ధర్మరాజు నీ కిట్లు చెప్పుమన్నాడు. తండ్రిలేని బిడ్డలమైనా మమ్ము చిన్నతనము నుండి పెంచి పెద్దవారిని జేశావు. నీవు చెప్పినట్లే పన్నెండు ఏండ్లు అరణ్యవాసము ఒక యేడజ్ఞాతవాసము సక్రమముగ జేసి వచ్చాము. మా న్యాయ భాగమును మాకు నీ విప్పింతువను నమ్మకమే. మాకు నీవే దిక్కు. మాలో తప్పు లుంటే పిలిచి చీవాట్లు పెట్టుము. నీవు జీవించియుండు కాలమునకు నీవే మాకు ప్రభువువు. మరియొకరి నెరుగము. మా ఉభయ పక్షములలో నీ తప్పు యున్నా లెక్కలోకి రావు. నీవు ధర్మముతో వర్తించి నట్లయితే మా లోపము లన్నియు కప్పిపోవును.

కనుక పాండవులకు వారి తండ్రి పాలిచ్చి నీ పాలు నీవు పుత్ర పౌత్ర సహితముగా ననుభవింపుము. నీ కొడుకులచే వినిపించి భాగ మియ్యని యెడల వారు యుద్ధమునకు సంసిద్ధముగ నున్నారు. నెయ్యమో కయ్యమో ఈ రెండు మార్గములలో నీ కే దిష్టమో నిశ్చయించుకొనుము.

కేశవుని ఉపన్యాసము మూడు భాగములుగ నున్నది. మొదటి భాగములో పాండవులతో సంధి జేయుట న్యాయమును శ్రేయస్కరము అని తన అభిప్రాయము చెప్పాడు. రెండవ భాగములో ధర్మరాజు యొక్క వినయమును రాజభక్తియు వెల్ల

డించి అతనికి రాజ్యమిచ్చిన యెడల నీ కేమియు ముప్పు వాటిల్లదనియు నీ అధికారమే ఉభయుల పైనను చెల్లుననియు తెలియ జెప్పినాడు. మూడవ భాగములో సంధి పొసగని యెడల యుద్ధము నిశ్చయమని చెప్పినాడు.

మొదటి రెండు భాగములు మాత్రమే జెప్పి బెదరింపుతో గూడి యున్న మూడవ భాగమును వదలి సంధి సౌమ్య మార్గమున పొసగనియెడల దండోపాయము నవలంబించిన ఉత్తమముగ నుండెడి దని తోచవచ్చును గాని వాసుదేవుడు మొదటినుండియు సామోపాయము చెడుగుల యెడ ఫలకారి కాదనియు లోభియైన యాంబికేయునికి క్షాత్ర రుఝళిపించనిది ప్రయోజనము లేదనియు కార్యోన్ముఖుడు కాడనియు ఎంచి సామదండోపాయముల రెంటిని కలిపియే ప్రయోగించుచు వచ్చినాడు. ఈ ఉపన్యాసము మొత్తముమీద ఆంబికేయు నుద్దేశములో బెట్టుకొని చెప్పినదే గాని దుర్యోధను నుద్దేశించి చెప్పినది గాదు. అటుపైన సభ జూడ వచ్చిన జమదగ్ని కణ్వ నారదులును సంధి జేసుకొన వలసినదని దుర్యోధనునితో గట్టిగా జెప్పారు.

అంత దుర్యోధనుడు తనతండ్రి వెరచి యేమి యయిన లేక జవాబు చెప్పునని సందేహించియో లేక పిల్లవాడు నే జెప్పిన వినడని జవాబిచ్చి తప్పించుకొనుట కవకాశము గలిగించుకొను ననియో చప్పున లేచి అందరి తరపున ముందుగ తానే జవాబు చెప్పాడు. అది ఇది.

మునులార నన్ను విధి యే
మనమును బుట్టించె నట్టు లయ్యెడు గాకీ
విన జవులు గాని పలుకుల
బని గలదే యుడుగు డింక బహు భాషణముల్

అని ముక్తసరిగా జెప్పి కూర్చున్నాడు.

అంతట ఆంబికేయుడు చటుక్కున అందుకొని మునులకు కోపము రాకుండ "అయ్యా తమ ఉపదేశములను శిరసా వహించి నిర్వహించు భాగ్యమునకై నే నోచుకొనలేదు. ఇక నే జేయవలసిన దేమున్నదనియు తరువాత శౌరి వంక దిరిగి "ఇహ పర సాధనమయిన

నీ యాజ్ఞను నడిపింప శక్తి నాకు చాలదు. తెలివిమాలిన కొడుకు ఒకవైపునా, మాట తీసివేయరాని చుట్టమవు, మహానుభావుడవు, దయాపరుడవునైన నీవు రెండవవైపునా వున్నారు. వీనిని సౌమ్యమార్గమున దిద్దుకొను భారము నీది." అని జవాబు చెప్పాడు. ఇది చాల గడుసు దనపు జవాబు. సౌమ్య వాక్కులతో పిల్లవాడు తెలివి తక్కువ వాడు కనుక దండార్హుడు గాడు. నేను పెద్దవాడిని, చుట్టమును. పిల్లవానిచే వినిపించ లేను. అయినను నన్ను జూచియైనను ఊరకొనుడు. మంద బుద్ధియైన ఈపిల్లవానిని సౌమ్యమార్గమున—అనగా శిశుపాలు విషయములో వలె చక్ర ముపయోగించి కాదనుట—నీవే దిద్దుకొనుము-అన్నాడు. ఇక నన్నడుగ వలసిన పని లేదన్నాడు.

త్రివిక్రము డంతట దుర్యోధనునకు నయమునా భయమునా జెప్పాడు. నీవు గెలవ వన్నాడు. అర్జునుడికెవ్వరూ ఎదురు లేరన్నాడు. ఉత్తరగోగ్రహణము నాటి కయ్యమే సాక్ష్య మన్నాడు. అంబికేయుని యందు రాజ్యభార ముంచి మీ రిద్దరు చెరి సగముగా యువరాజ పట్టభద్రులై శాశ్వత సౌఖ్యము లనుభవింతు మన్నాడు. తరువాత భీష్మ ద్రోణులు గట్టిగా సలహా జెప్పారు.

అంత దుర్యోధనుడు పరిస్థితుల పరికించి భీష్మాదులును తండ్రియు మునులును శౌరి వాక్యములచే తనకు వ్యతిరేకులై యున్నారని గ్రహించి సమగ్రముగ తన పక్ష వాదమును జెప్పనెంచి ఉపక్రమించాడు.

కృష్ణా! భీష్మ ద్రోణులు నన్నెల్లప్పుడును చిన్నవానిగ భావించి కసరుకొనడము మామూలైనది. నీవును తగవు విచారింపక వారు చెప్పినదే వేద మనుచున్నావు. పాండవులు పత్నీ సహితముగ అడవుల పాలైతి మని నిష్కారణము నన్ను నిందించుటేల? చింతాకంతయినను నా దోషము లేదు. ధర్మరాజు జూదరి. మొదట రాజ్యమంతా వోడిపోయినాడు. తిరిగి యిచ్చి వేశాము. జూదములో నేర్పరి గాకున్నను అతనికి వ్యసన మెక్కువ. మూర్ఖుడై తిరిగి జూదమాడి స్వయంకృతాపరాధముచే అడవుల పాలయినాడు. దీని కంతకు నే నా జవాబుదారి? ఇప్పుడు మళ్లీ మామలను వియ్యాంకు

లను పోగుచేసుకొని కయ్యానికి తయారైనాడు. ఈ యుద్ధమున కును వారే కారకులు. ఈ క్రూరకర్మమునకు పూనుకున్నమని మమ్ము నిందించుట యెందుకు! శత్రువులు మాపై దండెత్తి వచ్చినప్పుడు మేము మాత్రము వంగి నమస్కారములు పెడుదుమా? క్షాత్ర ధర్మము బూని ఓపినంతగ బోరి ఇహమో పరమో సంపాదింపు కొంటాము. నే చిన్నతనములో నుండగా నా తండ్రియు తాతయు వృధాగా నా రాజ్యము పంచి పెట్టారు. ‘నా శక్తి సామర్థ్యము తెలియక వారు మళ్ళీ నా రాజ్యము పరుల పాలు జేయ దలచినను నే నేల సహిస్తాను. మునుపు వాటముగా సగము రాజ్యము సంపాదించినట్లే తిరిగి వారు పాలని పంచిపెట్టమని వచ్చారు. ఇక మేము పంచుకొని రాజ్య మేలడము కల్ల. సామమున సూది మొన మోపినంతయు గూడ యియ్యను. ఎవరయినను సమరము చేసి జయించి రాజ్య మేలవలసినదే.

త్రివిక్రమా! నీకు కావలసినది నిశ్చయించుకొని నన్నీవు కోరినట్లు యుద్ధమే వస్తుందిలే. ఇక తృప్తిపడు. రేపే ప్రారంభము. నీ వల్ల నే తప్పును లేదన్నావు. నీవు పుట్టినది మొదలు చేసిన వన్నియు తప్పులే. విషము పెట్టించావు. పాముల గరపించావు. నీళ్ళలో త్రోయించావు. లక్క యింట్లో బెట్టి కాల్పించావు. ఓర్వలేక కపట జూదము బెట్టి రాజ్య మపహరించావు. అన్నదమ్ముల కీచులాటలో సతులను వెండ్రుకలు బట్టి సభ కీడ్పించి గుడ్డ లొలిపించి మానభంగము గావించావు. ఈ విషయమున నీకు నీవే సాటి. నీవూ కర్ణుడూ కులాంగనను పరాచిక లాడారు. మీ కూతలు విని చేతలు చూచిన వారందరిక్కడ నుండగనే నీ నేరము లేమున్నవంటున్నావు. వారే దండెత్తి వచ్చారని తప్పుకో జూచినంత మాత్రమున నీవు బ్రతుకబోవు

ఇట్టి స్థితిలో కార్యము మించుచుండడము జూచి దుశ్శాసను డన్నయ్యా

**జనకుండా గురుభీష్ములున్ దగిన వర్గం బాప్తులై పెక్కు వీ**
**రి నెరింగించు తెరంగు గాదు తన బుద్ధిం బోయి సంధాన మి**

ట్లానరం జేయక యున్న కృష్ణునకు నిన్నొప్పించు వారింక వ
ట్టు నిజం బిచ్చట నింక నీ యునికి చెట్టుం గీడు బుట్టుం జుమీ

అని సూచించిన వెంటనే దిగ్గన దుర్యోధనుడు లేచిపోయినాడు. కర్ణాదులును ఆయన వెంటనే పోయి ఎదురుగా కొంత దూరమున గుంపు గట్టి నిలుచున్నారు.

అంత భీష్ముడు ఈ దురభిమాని యైన దుర్యోధనుడు కొవ్వి తానొక మహారాజు నని భావించి మదమాత్సర్యముల చేత మతిచెడి లేచి పోయినాడు. ఆతనితో ఇందు కొందరు రాజులు కూడా లేచిపోయి నారు. ఏమి వీరి పౌరుషము. జనార్దనా, వీరందరికి చేటుకాలము వచ్చిన దనగా కృష్ణుడు వారివంక దిరిగి ఈ గర్వపోతు యిదియంతయు సభాసదుల కవమానము సేయుట యని యైనను తలంపడు. దీని కేమియు ప్రతిక్రియ లేదా? ఈ నీచుని బోకార్చి కులము రక్షింప రాదా? పూర్వము నేను శస్త్రము చేసి శరీరమును గాపాడినట్లు కంసుని వధించి తండ్రికి రాజ్యకట్టము గట్టి కులము రక్షించితిని. మీరును అట్టి కార్యమున కేల అంగీకరింపరు. దానితో అన్ని చిక్కులు తీరిపోవును. ఇది మీకు యుక్త మని తోచుట లేదా అన్నాడు. ఇంక యే మనునో తెలియదు. కాని ధృతరాష్ట్రుడు కార్యము తప్పి వచ్చిన దనీ పై ప్రశ్నకు సభాసదులు ఏమి జవాబిత్తురో కృష్ణు డేమి చేయునో యని భయపడి తానప్పుడు స్వయముగా చేయగల దేమియు లేదని గ్రహించి కొత్తయెత్తు యెత్తాడు. అయ్యా తొందర పడ వద్దు. వాడి తల్లి గాంధారి బుద్ధిమంతురాలు. ఆమె చెప్పి వినిపించ గల దని యామెను పిలిపించారు. ఇంతలో ఉగ్రపరిస్థితులు మారి పోయినవి. అపాయము గడచిపోయినది. గాంధారి వచ్చి ధృత రాష్ట్రునితో నీ కొడుకు అవినీతుడు. నీ చేతి కే మద్ద మున్నది. పిల్లవానితో నేమి పని యని చెప్పి దుర్యోధనుని తీసుకరా బంపారు. అంతవరకు దుర్యోధనుపై మోపిన భార మంతయు ధృతరాష్ట్రుని పైకి తిరిగినది. గాంధారి క్లిష్టపరిస్థితు లన్నిటిని మార్చివేసినది. మున ల్లిద్దరు మామూలు సలహాలు జెప్పారు. విని మారు మాటాడక దుర్యోధనుడు లేచి పోయినాడు.

అంతట దుర్యోధనుడును మంత్రులును యోచించి కృష్ణుడు తాను పూర్వము కంసుని జంపినట్లు నన్ను బరిమార్చ సూచనలు చేయుచున్నాడు. ఆలసింపకుడు. వానిం బట్టి చెరబెట్టుదము. అంతట పాండవులు లెక్క లు లేని పులుగు లగుదు రని నిశ్చయించారు. సాత్యకి అది గ్రహించి తమవాడైన కృతవర్మను వాకిట కావలి బెట్టి కృష్ణుని కంతయూ జెప్పి సభాసదులకు వెల్లడించాడు. విదురు డదరి పడి ధృతరాష్ట్రునితో జెప్పాడు. అంతట కృష్ణుడు ఆంబికేయునితో నీ కుమారులకు నా మీద చాల కోపము వచ్చినది. నాకు సంతోషమే పోయివచ్చెద ననగా నాతడు విదురుని బంపి దుర్యోధనాదుల బిలిపించి చీవాట్లు బెట్టాడు. శ్రీకృష్ణభగవానుని పూర్వచరిత్ర వర్ణించాడు. శ్రీహరి తన విశ్వరూపము జూపించి ధృతరాష్ట్రాదులకు దివ్యదృష్టి యొసంగి విశ్వ రూప సందర్శనము జేయించాడు. విశ్వరూప ముపసంహరింప బడిన వెనుక చీకురాజు భగవానుని జూచిన కండ్లతో నితరవస్తువుల జూడనొల్లక అంధత్వమే కోరుకున్నాడు. శౌరి యందరిని బంపివైచి సాత్యకి కృతవర్మలతో గలసి వెడలినాడు. ఈ విధముగా రాయబారము ముగిసినది.

ఈ సందర్భమున మఱియొక విషయము జెప్పవలసి యున్నది. శౌరి కర్ణునితో నతని జన్మవృత్తాంతమును జెప్పి రాజ్యమును ద్రౌపదిని యిప్పించెద నని యాశపెట్టి అతనిని మరల్ప జూచాడు గాని యది సాధ్యమయినది గాదు.

అచ్యుతుడు తన రాయబార విషయమై ధర్మజునితో సంక్షేపముగా నిట్లు జెప్పియున్నాడు. కయ్యము గాని తెరగున నెయ్యమే గలుగునట్లు చెప్ప వలసిన దంతయు జెప్పాను. నా పలుకులు లెక్కగొనక అడ్డ దిడ్డపు జవాబులు చెప్పాడు. ఎవరెంత జెప్పినను వినక తన వారలనెల్లను కురుక్షేత్రమునకు నడవం డని ఉత్తరువు చేసినాడు. సామవాదములు జెప్పాను. ఇతరుల చేత చెప్పించాను. అందువలన ప్రయోజనము గానక. కినుక దెచ్చుకొని జంకించీ భంగించీ ధిక్కరించీ తృణీకరించీ చూచాను. కార్యము లేక పోయినది. తుదకు అశక్తమర్జనత జేయ జూచాడు. అందుకు అతిమానుషము

లయిన కొన్ని పెదమాటలు వన్ని చూచాను. చేయదగిన దంతయు చేశాను. ఎందునను ప్రయోజనము లేకపోయినది. భాగమియ్య డనుట నిశ్చయము. తరువాత మీ యిష్టము.

కృష్ణు డెన్ని మార్గముల ప్రయత్నించినా ప్రయోజనము లేకపోయినది. అతడు తగినంత ప్రయత్నము జేయు లేదనుట క్రమము గాదు. ఈ ప్రయత్నము లన్నియు విఫలమగుటకు కారణము దుర్యోధనునకు ప్రాయోపవేశ సమయమున అతడు గన్న దృశ్యముచే తనకు జయము కలుగక తప్పదను దృఢవిశ్వాసమే. ఈవిశ్వాసము యుద్ధాంతము వరకును అనగా ద్వైపాయనహ్రదము కడ భీమ దుర్యోధనుల గదాయుద్ధము జరిగి కాళ్లు విరిగి నేలబడు వరకును అతనిని విడువలేదు.

కృష్ణుని రాయబారము వలన సంధి పొసగలేదు గాని యితర లాభములు చాలా గలిగినవి. భీష్మద్రోణులకు మనసు విరిగి నామమాత్రము సేనాముఖమున నిలచి యుద్ధము చేసి నామకులైన వారినెవరిని జంపక తమను జంపు రహస్యములు గూడ ధర్మజునకు వెల్లడించారు. భీష్మద్రోణకృపాశ్వత్థామలకు కర్ణుని మీద క్రోధము పుట్టినది. విదురుడు కత్తి బట్టలేదు. శల్యుడు పాండవులనే అభిమానించాడు. ఆఖరుకు కర్ణుడు గూడా కుంతికి అర్జునుని దప్ప యితరుల జంప నని వాగ్దానమిచ్చాడు.అనగా దుర్యోధనుని సేనాధ్యక్షు లందరును ఏదోవిధముగ ప్రతిపక్షుల కభిమానమే చూపారు. పాండవుల వైపు వారెవ్వరును కౌరవుల యెడ కనికరము చూపలేదు. దీనికంతకును కారణము పాండవపక్షమున మిక్కిలి నేర్పుతో రాజనీతి నుపయోగించి లోకము యొక్క అభిమానము తమ వైపు త్రిప్పు కొనుటయే. కౌరవులు కేవలము బాహుబలము మీదనే ఆధార పడ్డారు. గడచిన ఐరోపాసంగ్రామములో అన్ని విధముల ఆంగ్ల రాజనీతి పాండవ రాజనీతితోడను జర్మను రాజనీతి కౌరవరాజనీతి తోడను పోల్చ దగియున్నది. పాండవ సచివుడైన కృష్ణుని మంత్రిబలమునకు దుర్యోధనుని ప్రధాన మంత్రియైన కర్ణుని రాజనీతి చాలినది గాదు. బుద్ధి బలమునకు దేహ బలము లోబడినది. కౌరవులకు పరాక్రమము తక్కువగుటచే అపజయము కలుగలేదు. దుష్ట చతుష్టయము వారి మంత్రి లోపమే వారి యపజయమునకు కారణ మైనది.

# శాతవాహన వంశీయులనాటి శాసనములు

ద్వితీయ సంచికానుబంధము

## శ్రీయుత భావరాజు వేంకట కృష్ణారావుగారు బి యె బి యల్

## నాసిక గుహాలందలి శాసనములు

(ఇది మూడవ గుహాయొక్క లోపలికప్పుక్రింద వసారాలో తూర్పువైపున గల గోడమీద నున్నది.)

### మూలము (ప్రాకృతము)

౧ సిద్ధం సెనాయె వెజయంతియె (1) విజయఖధావారా గొవధనస బెనాకటకస్వామి (2) గొతమిపుతొ సిరిసదకణి (3)

౨ ఆనపయతి గొవధనె అమచ విణ్హుపాలిత (4) గామె అపరక ఖడియె య(5)ఖటం అజకాలకియం ఉసభదతెన(6)భూతం నివతన(7)

3 సతాని బె ౨౦౦ ఎత అమ్హఖెత నివతణ సతాని (8) బె ౨౦౦ ఇమెస పవజితాన తెకిరసిణ (9) వితరామ ఎతస చన ఖెతస పరిహార

౪ వితరామ అపవెస (10) అనొమస (11) అలొణఖాదక అరఠస వినయిక సవజాతపారిహారిక (12) చ ఎతహిన పరిహారెహి పరిహరహి

పాఠభేదములు

(1) వెజయంతిరెయు (2) బెనాకటకా స్వామి (3) సదకాణి (4) పాలితం, (5) డియం ఖంకె; డియ యఖె (6) ఉషభదాతెన (7) నివతన (8) సతామ్హి (9) సిన, సినా (10) అపావె, అపావెసం (11) మసం (12) తపరి

౫ ఎతె (13) చన ఖెతపరిహారె చ ఎథ నిబధాపెహి (14) అవి యెన (15) అణతం అమచెన శివగుతెన ఛతో మహాసామి యెహి ఉపరఖితో (16)

౬ దతా పటికా సవఛరె ౧౮ వాసపఖె ౨ దివసె ౧ తాపసెన కటా (17)

సంస్కృతము - ఛాయ.

౧ సిద్ధమ్! సేనాయాః విజయంత్యాః విజయ స్కంధావారాత్ గోవర్ధనస్య బెనాకట (క) స్వామీ గౌతమీపుత్రః శ్రీశాతకర్ణిః

౨ ఆజ్ఞాపయతి। గోవర్ధనే అమాత్య విష్ణుపాలితం గ్రామే అపరక ఖణ్డియే యత్ క్షేత్రం అద్యకాలకీయం ఋషభదత్తేన భూతం నివర్తన

3 శతానిద్వే ౨౦౦। ఏతదస్మాత్ క్షేత్ర నివర్తన శతానిద్వే ౨౦౦ ఏతేషాం ప్రవ్రజితానాం త్రైరశ్మికానాం వితరామ। ఏతస్య చన క్షేత్రస్య పరిహారం

౪ వితరామ। అప్రవేశ, అనవమస, అలవణఖాదక, అరాష్ట్ర సవినయిక, సర్వజాతపారిహారిక చ ఏతైః న పరిహారైః పరిహారాథుహి।

౫ ఏతే చన క్షేత్ర పరిహారేచ అత్ర నిబద్ధావహి అవియేన ఆజ్ఞప్తం। అమాత్యేన శివగుప్తేన క్షతః మహాస్వామికైః ఉపరక్షితః

౬ దత్తాపట్టికా। సంవత్సరే ౧౮ వర్షాపక్షే [ద్వితీయే] ౨, దివసే [ప్రథమే] ౧. తాపసేన కృతా।

ఆంధ్రీకరణము

సిద్ధం! విజయంతీసేన యొక్క విజయ స్కంధావారము నుండి బెనకటక స్వామియు గోవర్ధన స్వామియు నగు గోతమీ పుత్ర శాత

పాఠభేదము లు ..

(13) ఎత (14) నిబధోలిహి (15) మవియెణ, అవియెణ (16) రఖితా (17) తావసన కటా.

కర్ణి మహారాజు గోవర్ధన మందున్న విష్ణుపాలితుని కిట్లు ఆజ్ఞాపించు చున్నాడు:— నేటివఱకు ఉషభదత్తునిచే (ఋషభదత్తుని) ననుభ వింపబడుచుండి యిపుడు మాచే ననుభవింపబడు చున్న "అపరఖం డియ" గ్రామము నందున్న "అజకాలకియ" మను క్షేత్రము ౨౦౦ నివర్తనములను "తెకిరసిణు" లయిన (త్రిరశ్మి పర్వతవాసు లయిన) తాపసులకు విడిచి పెట్టితిమి. ఇంకటి నుండి యాతాపసులు ఆభూమిని రాజకీయులకు ప్రవేశింప రానిదిగను, వారెవ్వరి చేతను ఎట్టి సంబంధ మును కలుగచేసుకొన బడకుండను, ఉప్పు మొదలగునవి త్రవ్వకొన బడరానిదిగను, రాష్ట్రకులు (ఊరి కావలివారు) ఏ విధముగను జోక్య ము కలుగజేసికొన రానిదిగను విశేషించి సర్వ కర పరిహారము గను ఇచ్చితిమి. ఇట్లు సర్వ కరహారములతో మేము దానము చేసినట్లు నీవు ఒసంగవలయును. ఈ భూమిని మేము దానము చేసి నట్లును మేము విడిచిన సర్వ కరపరిహారములను అపర ఖండియ గ్రామము నందు ప్రకటింపుము. మాచే వాగ్రూపమున నీయబడిన యీ దాన శాసనము శివగుప్తునిచే వ్రాయబడి మహాస్వాములచే సంరక్షింప బడుచున్నది. ఇది మా విజయ రాజ్య. సంవత్సరములు పదునెనిమిదియు వర్ష ఋతువు ద్వితీయ పక్షమున ప్రథమ దివసమున నీయబడిన దాన పత్రిక. ఇది తాపసిచే నిందు లిఖింప బడియెను.

సంగ్రహ వ్యాఖ్య.

"వైజయంతి" అనునది యొక నగరనామము గావచ్చును. కాదేని "విజయ" పర మయిన అర్థ మిచ్చు విశేషణము గావచ్చును. విజయస్కంధావారమున నున్న "విజయంతి" అను పేరు గల సైన్యమునకు విజయసూచక మయిన వాచకము గావలయును. కడ పటిదే యదార్థ మని అంగీకరించినచో శాతకర్ణి మహారాజునకు తనకు విజయములను సమకూర్చిన సైన్యమును "విజయంత్యాః"యను బిరుద ముతో ప్రశంసించుట మిక్కిలి ప్రీతికర మయిన విషయము కాబోలు నని యూహింప వలయును.

"బెనాకటక" శబ్దమందు రెండవ అక్షరము దీర్ఘముగా గాన్పింపదు. "బెనకటక" యన నది దేశభేదము చేత "వెణకటక"

పదమునకు వికృతరూప మని తోచుచున్నది. ఇది సరియైన యూహా యని అంగీకరించినచో వెంకట కటకము వెణ్ణాయూద (కృష్ణవేణీ తటము మీాద) నున్న పట్టణము, ధనకటకము గావచ్చునని నిర్ణయింపవచ్చును. వెనుకటి శాసనము నందు వలె రాజీ రాయసమును రాజధాని నుండి యాజ్ఞాపించినట్లు కన్పట్టు చున్నది. కావుననే బెనకటకమును ధన కటకమునకు ముడిపెట్ట వచ్చును. గోతమీాపుత్రుని రాజధాని ధన కటక మగుట చరిత్ర ప్రసిద్ధము. అయిన నింకను ధనకటకమునకు బెన కటక మని యింకొక మారుపేరున్న దేమో పరిశోధింప వలసి యున్నది. "అజకాలకియ" మను పదము దత్త క్షేత్రమునకు విశేషణముగా దోచు చున్నది. మరియు నది "ఇప్పటి వఱకు ఋషభదత్తునిచే ననుభ వింప బడుచున్నట్టి దానిని" యని యందు చెప్పబడుట చేత కొంత సమంజసముగా నున్నది. ఈ శాసనమును బట్టి గోతమీా పుత్రుడు దక్షిణాపథమును జయించి క్షహరాత నహపానుని యోడించి ఋషభ దత్తుని భూములు లాగుకొని దిగ్విజయ యాత్ర సలిపి క్షాత్రపులను తన రాజ్యసీమల నుండి వెడల నడపిన కాలమును ఇంచు మించుగా నిర్ణయించుట కాధారము లభించు చున్నది. ఇక యీా యర్థమును విడచి పెట్టి కేవల వ్యాకరణానుసారముగా నన్వయము చేయదలచు కొన్నచో నీ యర్థము పొసగదు. అదియును గాక దత్త క్షేత్ర మును నిర్దేశించి తెలుపవలసి యున్నది గావున మొదటి యర్థమే సమంజసముగా నుండును. పూర్వము ఋషభదత్తు డనుభవించిన క్షేత్రమును పేరుతోనే అది ఇవు గిందు తెలుపబడు చున్నది. అజ కాలకియము (సం.___అద్యకాలకియమ్) భూమి పేరనియే నా యూహ. సేనార్టు పండితుడీ యూహ నంగీకరింప లేకున్నాడు. ఋషభదత్తుని కొక్క క్షేత్రమే యున్నదా? అతడు రాజగు నహపానుని యల్లుడు గావున యాతని కొక్క క్షేత్రమే యున్నటుల తలచుట పాడి గాదు గావున అజకాలకియ మనునది యొక్క భూమికి నామముగా దల చుట కంటె గ్రామనామముగా నెంచుకొనుట ఒప్పునని యాతని వాదము. కాని ఋషభదత్తుని కెన్ని క్షేత్రము లుండగూడదు? వాటి కన్నింటికిని పేళ్లుండ గూడదా? అందొకటి నేటివఱకు అతని

భుక్తమం దున్నది, యివుడుదత్తమైనది—అజకాలకియము కారాదా?

"తెకిసిరణ" అనునది యుచ్చారణ వికృతిచే మార్పు పొందిన "తెంసికానం" అను పదము గావలయును. ఇదియు తిరణ్హుకాన మను శబ్దము నొక్కటియే. కావున "తెకిసిరణ" లేక "తెరిసికానం" అనునవి సంస్కృతమున "త్రైరశ్మికానాం" అని యగుచున్నవి. అవుడు త్రిరశ్మివాసు లయినవారు అని అర్థము వచ్చును. త్రిరశ్మి పర్వతము నాశిక వద్ద నున్నది.

"మహాస్వామి" కు కిందు చేర్కొన బడి యున్నాడు. మహాస్వామికుడు గుహాలపై ధర్మాధికారి యని తోచుచున్నది. మహాస్వామియు మహావిహార స్వామియు నిరువురు నొక్కరేనా యని సంశయము తోచు చున్నది. గుప్త చక్రవర్తుల శాసనము లందును ఇతర శాసనము లందును గానవచ్చు నీ పదమును "మహావిహారస్వామి" యను ధర్మాధికారితో డాక్టరు ప్లీటు సరిపోల్చు చున్నాడు. "విహార స్వామియు" "మహా విహారస్వామియు" "చులికఆర్యకుడు" "మహాఆర్యకు"ని వంటి అధికారులుగా తోచుచున్నదని సేనార్టుపండితుని అభిప్రాయము. "ఆర్యక" లేక "మహాఆర్యక" పదము ధర్మాధికారులకును, భిక్షువులకును సమముగా వాడబడ చుండినట్లు కనబడు చున్నది. యజ్ఞశ్రీ శాతకర్ణి మహారాజు "ఆర్యకు"డని యొకచోట నుదాహరింప బడి యున్నాడు (చూడుడు-ఎపిగ్రాఫియా ఇండికా- సం. ౧. పు. ౯౬) కాని సేనార్టు పండితుడు "ఆర్యక" పదము ధర్మాధికారులకే వినియోగింపబడు చుండినట్లుగా నెంచుచు నొక యుదాహరణము నిచ్చు చున్నాడు. అర్హత (ఆచార్య) బుద్ధ రక్షిత, ఆర్య బుద్ధ రక్షిత యని అమరావతీ శాసనములందు చేర్కొనబడి యున్నది. ఆమెకు "చూళ ఆర్య" అని గౌరవ మీయబడినట్లు గూడ తెలియుచున్నది. కావున నిందు పేర్కొన బడిన మహాస్వామికు డొక ధర్మాధికారి గావలయును గాని, భట్టారకు డగు శాతకర్ణి కాజాలడు.

౫

## మూలము (ప్రాకృతము)

( పై నాల్గవ శాసనము ననుసరించి చెక్కబడి యున్నది. ఈ శాసనము వేఱని సూచించుటకు నడుమ స్వస్తి కమలము వ్రాయబడి యున్నది. )

౬ సిద్ధం గోవధనె అమచస సామకస (1) దెయొ రాజాణతో (2)

౭ రణో గోతమిపుతస సాతకణిస (3) మహా దెవీయ (4), చ జీవసుతాయ రాజమాతుయ వచనెన గోవధనె (5) ... చో (6) సామకో అరోగవతవో తతో ఎవ చ

౮ వతవో ఎథ (7) అమ్హెహి పవతె తిరణ్హుమ్హి అమ్హధమదానె లెణె పతివస తానం (8) పవజితాన భిఖూన గామె కఖడీసు పువ ఖెతం దత త చ ఖెత

౯ కసతె (9) సొ చ గామొ న వసతి ఎవం (10) సతి య (11) దాని ఎథ (12) నగరసీమె రాజకం ఖెత (13) అమ్హసతకం (14) తతో ఎతెస (15) పవజితాన భిఖూనం తెరణ్హుకానం దదామ

౧౦ ఖెతస నివతణసతం ౧౦౦ తస చ ఖెతస పరిహార (16) వితరామ అపావెస అనోమస అలోణఖాదక అరఠసవినయిక సవజాత పారిహారిక చ

౧౧ ఎతెహి న పరిహారెహి పరిహారెథ (17) ఎత చ స ఖెత పరిహారె (18) చ ఎథ (19) నిబధాపెథ (20) అవియెన (21) అణత పటిహారఖియ లోటాయ ఛతో (22) లెఖో (23) సవఛరె ౨౪

పాఠభేదములు.

(1) సమకస (2) రాజనితో, రాజణితో (3) సత (4) దెవియ (5) గోవధనే (6) అమచో (7) ఎత (8) పతివసతాన (9) వకసతె, వకంసతె (10) ఎవ (11) యం (12) ఎత (13) ఖెతం (14) అమసతకం (15) ఎతస (16) హారం (17) హారిథ, హారెథ (18) పరిహార (19) ఎత (20) నిబధాలత (21) సువియె (22) లాజనియమతా, లోటాయమతా (23) లెఖె. (24) వసాన (25) పంచమె (26) పుకజితినా, పుజితినా (27) నిబధా (28) సంవాఛరె.

౧౨ వాసాన (24) పఖ ౪ దివసె పచమె (25) సుజివినా (26) కటా నిబధో (27) నిబధో సవఛరె (28) ౨౪ గింహాణ పఖే ౨ దివసె ౧౦.

### సంస్కృతము — ఛాయ

౬ సిద్ధమ్! గోవర్ధనే అమాత్యస్యశ్యామకస్య దేయః రాజాజ్ఞప్తః

౭ రాజ్ఞో గౌతమీపుత్రస్య శాతకర్ణేః మహాదేవ్యాశ్చ జీవసుతాయ రాజమాతుః వచనేన గోవర్ధనే అమాత్య శ్యామకః అరోగ వక్తవ్యః (?) తత ఏవ చ

౮ వక్తవ్యః అత్ర అస్మాభిః పర్వతే త్రిరశ్మిని అస్మద్ధర్మ దానే వేణే (?) ప్రతివసతాం ప్రవ్రజితానాం భిక్షూణాం గ్రామే కఖడీను పూర్వక్షేత్రం దత్తం తచ్చక్షేత్రం

౯ [న కర్షతే I (?)] స చ గ్రామో న వసతి ఏవం సతి చ ఇదానీం అత్ర నగరసీమాయాం రాజకం క్షేత్రం అస్మత్ (?) శతకం తతో ఏతేషాం ప్రవ్రజితానాం భిక్షూణాం త్రైరశ్మికానాం దదామః;

౧౦ క్షేత్రస్య నివర్తనానాం శతం ౧౦౦ తస్య చ క్షేత్రస్య పరిహారం వితరామః అప్రవేశ్య అనమర్శ్య అలవణఖాదక అరాష్ట్రసవినయిక. † సర్వజాత పారిహారిక చ

౧౧ ఏతైః నను ౯ పరిహారైః పరిహరేత ఏతత్ చస * (?) క్షేత్ర పరిహారశ్చ అత్రనిబద్ధ్యేత అవియేన (?) అజ్ఞప్తః ప్రతీహార రక్షి (?) లోరటాయ్యేణ కృతః లేఖః సంవత్సరే ౨౪

౧౨ వర్షానాం పక్షే ౪ దివసే (౫) పంచమ్యాం సుజీవినా కృతా ౭ నిర్బంధో నిర్బంధః సంవత్సరే ౨౪ గ్రీష్మస్య పక్షే ౨ దివసే ౧౦

---

వెనుక నేను వ్రాసిన రీతిగానే యీ శాసన మందు గూడ ద్విత్వాక్షరములు సరిగా చెక్కబడనందున సంస్కృత ఛాయ వ్రాయుటలో చాలా శ్రమ కలిగినది, తప్పు లుండవచ్చును. సహృదయులు మన్నించి తెలిపిన సవరించు కొందును.

I తెలియవచ్చుట లేదు.

† "వినయ" శబ్దమునకు అర్థ శాస్త్రమున అజ్ఞ అని అర్థము కలదు. ఇంగ్లీషులో "ఆర్డరు" అని అర్థము.

ఆంధ్రీకరణము

సిద్ధం. గోవర్ధన మందున్న అమాత్య శ్యామకుడు మహా రాజుచే నిట్లాజ్ఞాపింప బడు చున్నాడు. శ్రీ గోతమీపుత్ర శాతకర్ణి మహారాజును, జీవ సుతుడు గల రాజమాత గౌతమి (బలశ్రీ) మహా దేవియును గోవర్ధన మందున్న అమాత్య శ్యామకుని " ఆరోగుని" కుశల ప్రశ్న గావించి మన్ననతో నుభయులు ఇట్లు ఆజ్ఞాపించు చున్నారు:- ఈ తిరణ్హు (త్రిరశ్మి) పర్వతము మీద మహాదేవి గౌతమి పెట్టించిన "ధర్మసేతు" గుహ యందు నివసించుచున్న భిక్షువులకు పూర్వము కఖడీ గ్రామమున శతనివర్తనముల క్షేత్రము దానము చేయబడినది. ఆ భూమి యిపుడు సాగుబడి చేయ బడుట లేదు. ఆ "కఖడీ" గ్రామమున జనులు నివసించుటయును లేదు. ఇట్లగుట వలన ఈ నగర సీమలందున్న (గోవర్ధన నగరము) మాస్వంత (రాజక మైన) గ్రామమున నొక క్షేత్రమును త్రిరశ్మి పర్వతముమీద నివసించు భిక్షువులకు శత ౧౦౦ నివర్తనముల భూమిని యిపుడు తిరిగి దానము చేయుచున్నాము. ఈ దత్తక్షేత్రము నందు మాకు రావలసిన పరి హారముల నన్నిటిని వదలి వేసితిమి. ఈ క్షేత్రమును రాజకీయులు ప్రవేశింపరాదు. వారెవ్వరును దీనిని స్పృశింప కూడదు. ఇందు ఉప్పు త్రవ్వకొన కూడదు. రాష్ట్రిక పాలకులు (కావలివారు) ప్రవేశించి జోక్యము కలుగ జేసుకొనరాదు. దీనిని మేము సర్వకర పరిహారముగా నిచ్చితిమి. ఈ దానమును సర్వకరపరిహారముగా జేసి యోగ్యముగ నట్లు అచ్చట ప్రకటించుము. జాగరూకతతో దీనిని సంరక్షించు నట్లును సర్వకర పరిహారములు వదలినట్లును మాయాజ్ఞ పరిపాలించు నట్లు చేయవలెను:— తొలుత నీ దానము వచన రూపముగా నీయబడి ప్రతీహార లోరటార్యునిచే లిఖియింప బడినది. విజయరాజ్య సంవత్సరములు ౨౪, వర్షఋతువు ౪ వ పక్షమున పంచమీ దివసమున సుజీవిను డీ శాసనమును

§ "వసు" ప్రాకృతము లో "వ" యని యుండుటచేత "వసు" తప్పక అను అర్థమునకు మార్చితిని.

* చస దీని భావము నాకు తెలియ లేదు,

ప్రకటించు చున్నాడు. మహారాజుచే నిది విజయ రాజ్య సంవత్సరములు ౨౪, గ్రీష్మ (౨) ద్వితీయ పక్షమున దశమి (౧౦) దినమున నాజ్ఞాపింప బడినది.

సంగ్రహ వ్యాఖ్య.

ఈ శాసన మందు గమనింపదగిన విషయములు రెండుమూడు కలవు. ఈ దానము తొలుత మహారాజు చేతన్ను అతని రాజమాత చేతను వచన పూర్వకముగా నీయబడినది. పిమ్మట నా యాజ్ఞను మాధ్యస్థు లెవరో దీనిని గొనివచ్చి అమాత్యశ్యామకునికి నివేదించిరి. ఈ రాజాజ్ఞను తీసుకొనిపోయిన ప్రతీహారు లెవరో తెలియదు. కఖడీ గ్రామక్షేత్రము సాగుబడి చేయబడ కుండినట్లు గౌతమీ పుత్రునితో భిక్షువులో మరి యితరులో విన్నవించి యుండవలయును. దాని పైన మహారాజు యీ దానముచేసి యుండవలయును. దాన మిచ్చిన దినమును పిమ్మట శాసనము లిఖయింపబడిన దినమును ఇందుదహరింపబడి యున్నవి. బహుళ; శ్యామకుడు తనవలన నెట్టి యాలస్యమును జరుగ లేదని విన్నవించుటకు గాబోలు రెండు తిథులను గూడను పేర్కొని యున్నాడు. దీనివలన నొక క్రొత్త విషయము దెలియ వచ్చుచున్నది. ధనకటకమున నీయబడిన యాజ్ఞను, శాసనమును లిఖించిన దినమునకు నడుమ ౮౫ దినములు గడచినవి. దాన మీయ బడిన దిన మీ కాలపు లెక్కకు జ్యేష్ఠ బహుళదశమి యగును. లిఖయింప బడిన దినము భాద్రపద బహుళ పంచమి యగుచున్నది. అనగా సింహమించుగా ధనకటకమునుండి బయలుదేరి గోవర్ధనమును (నాసిక) చేరుటకా కాలమున ౮౫ దినములు లేక అయిదు పక్షములు (రెండు మాసముల పదునైదు దినములు) పట్టునని తెలియ చున్నది. ఇంచుమించుగా ఎనిమిది వందల మైళ్ల దూరమును ప్రయాణము చేయుటకు ఆ కాలమున నింత స్వల్పకాలము బట్టె ననుట మిగుల నాశ్చర్యకర మయిన వృత్తాంతము!

ఈ శాసనములో పేర్కొనబడిన "కఖడీ" గ్రామమును పై శాసనములో పేర్కొనబడిన అపర "కఖడీ" గ్రామమును నొక్క

టియే యని తోచుచున్నది. కాని మొదటి గ్రామము "అపరకఖడీ"
యని యుండుటచేత నిది వేరొక గ్రామ మని తలపవచ్చును. కాని
పై శాసనమును, ఇదియు నొక్క తావుననే లిఖయింపబడి యుండుట
చేతను రెండును "ధర్మసేతు" గుహా యందున్న భిక్షువులకు సంబం
ధించిన వగుటచేతను ఈ సంశయము కలుగనక్కరలేదు. అయినను
యీ శాసనములు రాజకీయ నియోగులచే భద్రపరుపబడిన పత్రిములు
కావు గావున నిట్టి స్వల్పము లయిన ప్రమాదము లుండవచ్చును.
"కఖడీ" యనునది ఆంధ్రమున "కాకాండి" యయినదా యని నా
యనుమానము.

భావరాజు వెంకట కృష్ణారావు. బి. ఏ. బి. ఎల్

# పురాతన భారతీయ పురనిర్మాణము

కిళాంబి రంగాచార్యులు గారు ఎం. ఎ. బి. యల్.

## II

"క్రోపాట్కిన్ వ్రాసి కనపఱచినటుల బట్టణము లెల్లప్పుడును మహాపథ సంగమంబుల యందుండును. ఉత్తమంబగు పట్టణంబు, ఆభీరులకును, కృషీవలులకును, వణిజులకును, శిల్పులకును, పురోధనులకును యాత్రికులకును, రాజసభ్యులకును, సైనికులకును, సమాగమస్థానము. ప్రపంచముని సర్వభాగముల బుట్టు సర్వవిధ ఘనతా ప్రవాహములు ప్రవహించు కేంద్రస్థానము, అత్యాది పణ్యస్థానము, శ్రేష్ఠిచత్వరము సంపదలకు నిలయము, వివిధ దేశ పరస్పర వ్యవహార సంబంధి మంత్రణ కోష్ఠము, విశ్వభారతీ చతుశ్శాల"

జనులు నిర్మించు పురములు కాని గ్రామములు కాని వారి జీవిత విధానముల నిర్ణయించు శక్తులను వ్యక్తీకరించుచుండును. పురనిర్మాణముం బట్టి యా యా పురముల నిర్మించు జనుల ప్రబోధన మే యే రీతుల ననుసరించి వృద్ధిం బొందినదో విచక్షణతోఁ బరిశీలించిన మనము గుర్తెఱుంగఁ గలము. మఱియుఁ బురములు నిర్మాతల శిల్ప విద్యా కౌశల్యముఁ గనపఱచుచు నట్టి వారి నాగరికత యెట్టి యౌన్నత్యముం జెందినదో స్పష్టీకరించును.

బహుజనవాసస్థలము లనగ పట్టణములు మున్నగునవి. ఒకప్పుడు పట్టణములుగనే తన్నిర్మాణవిధానానుసారముగ నిర్మింపం

---

" The cities stand always, as Kropotkin points out, at the crossings of the great highways. The ideal city is the meeting place of shepherd and peasant, of merchant and artificer, of priest and pilgrim, of court and camp. It is the centre towards which converge streams that rise in all the quarters of—

బడుటయు, నొకప్పు డల్పగ్రామములు పెరిగి పెరిగి పట్టణము లగుటయు, నను రెండువిధముల నుద్భవించు చున్నవి. ఒకప్పుడు నెవ్వఁడో యొక నరపాలకునిచే నిర్మితములై పట్టణములు కాలాంతరములం జేసి యత్యంతము వృద్ధిం జెంది నియమరహితముగ పథములుండుటచే నసౌకర్యములు మిక్కుటములుగా నవసరమైన మార్పులట్టి వానియందుఁ గావింపఁబడు చుండును. ఇప్పుడు మన దేశములో ననేక పురములలోఁ దత్పురపాలక సంఘము వారలు దమ పురములం బాగు చేయుటకై ప్రయత్నించుచు నుపవనాదుల నిర్మించియు అల్పములైన సందులను విశాలమైన పథములుగ నొనర్చుటయు మున్నగు కార్యములం జేయుచుండుటయుఁ గనుచున్నారము. దేవాలయమో, వాణిజ్య సౌకర్యములు మిక్కుటముగ నుండుటయో, దుర్గాదులుండుటయో, పట్టణోద్భవ కారణము లని మన మెఱుంగవలయు. మహాపథముల సంగమస్థానముల యందును అట్టివాని పార్శ్వములను మహానదీ తీరములను, సముద్ర తీరములను, రాకపోక లతి సౌలభ్యముతో జేయుటకై యవకాశము లుండు తదితర ప్రదేశములలోను పట్టణము లుద్భవించు చుండును. కొన్నిచోట్ల నొక్క కుటుంబము వసియించు ప్రదేశము వృద్ధిఁ బొంది గ్రామమై వాణిజ్యాదులం జేసి పెరిగి పెరిగి పట్టణమై యేదియో యొక సమయమున పురనిర్మాణ విధానములం జేసి తగిన మార్పులం బొందింపంబడి యుండుటయు కానవచ్చు చున్నది. "గ్రామ మే కారణము వలననో యత్యంతము వృద్ధిం జెంది ఖరుదు భూమినుండి గాని సర్వేయప్రదేశము నుండి గాని భిన్నమగును. (అట్టి) ప్రదేశము దానిలో జేరిపోవును; లేక యొకప్పుడు నిరుపయోగ మగు మరుభూమి యగు దానిపై దగ్గిర దగ్గిరగ ననేక గ్రామములు నిర్మింపఁబడి కాలక్రమమున నా ప్రదేశము సన్నివేశావకాశముల వలన మహాఘ్రంబైన దగును. ఆంగ్లో ఇండియన్ పట్టణమైన కలకత్తామహాపట్టణోద్భవ మతి నవీన నిర్మితగ్రామ సమూహము వలన గలిగిన" దని సర్ హెన్రీ సమ్మర్ మేన్‌గారు వ్రాసిరి. పార్శ్వస్థగ్రామ సంయోగమువలన పట్టణము లుద్భవించు నని దీని వలన స్పష్టమగు చున్నను ఏ యే కారణములవలన గ్రామము లిట్టుల పట్టణము లగుచున్నవో మాత్రము స్పష్టీకరింప బడలేదు.

జరుగుచుండెడి దనియును స్పష్ట మగుచున్నది. దూర ప్రయాణ ములు చేయుటకు నదు లొసంగు సౌకర్యములు భూమి పైని బాట లొసంగ నేరవు. భరత ఖండాంతరస్థ దేశములతో వాణిజ్యాదులు నలుపుటకు ధూమశకటములు మున్నగునవి లేని కాలములో నదు లత్యంతము నుపయోగకరములై యుండెడివి. నదీ తటముల సమీప మున గాని సముద్రతీర సమీపమున గాని యుండెడి పట్టణాదులకు యుద్ధ సమయములలో శత్రువుల నుండి రక్షించు కొనుటకై యుండు నవకాశములు మెండు. స్వాస్థ్యహితము లగు నేర్పాటులఁ జేయు టకు నదు లధికావకాశములఁ గలుఁగఁజేయు చుండును. ఈ యీ యవకాశములఁ బూర్వ శిల్ప శాస్త్రజ్ఞులు లెస్సగ గుర్తె ఱింగియే, గ్రామ నిర్మాణముం గూర్చి

"నద్యాదీనాం దక్షిణాదాతీరే గ్రామాన్ని వేశయేత్"

అని చెప్పుచున్నారు.

నాలందాది పట్టణములు విశ్వ విద్యాలయములకు స్థానములై వన్నె కెక్కినవి. మొదట నాలంద చిన్న పల్లెయై యుండి నవు డచట నొక బౌద్ధ విహార ముండెను. సర్వ విద్యా పారంగతుఁడును పరమ తాపసియు నైన సారీపుత్రస్థవిరుఁ డా విహారమునకు యజమాని యైన పిదప నా మహానుభావుని కీర్తి యెల్లెడల వ్యాపింప విద్యా ర్థులు, ఉపాసకులు, భక్తులు నా ప్రదేశమునకు దండోపతండములుగఁ బోవ నారంభింప నా పల్లె రానురాను విశ్వవిద్యాలయ స్థానమై ఘన పట్టణ మైన దని విద్వాంసులు చెప్పుచున్నారు. విజయనగర సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమైన హంపి విద్యారణ్యస్వామివారి నిర్మాణమే యని చరిత్ర చాటుచున్నది. మఱియు నా పట్టణము విద్వచ్ఛేఖరులకును కవులకును నాశ్రయస్థానమై విద్యానగర మయ్యె. పూర్వకాలములో నైమిశారణ్యము నట్టి విద్యాపీఠ మని మనము గ్రహింపవలయును. కాశీపట్టణ మిప్పటికిని విద్యార్థులను విద్వాం సులను నాకర్షించుచున్నది. కాశీ విశ్వేశ్వర దర్శనార్థము పోవు యాత్రికులు కొలదిదినములే యచట నుందురు కాని విద్యా సంపాద నార్థమై పోవు వార లచట చిరకాలము వాసము చేయు చుందురు.

కొన్ని చోట్ల గను లుండుట వలననో, మణిశిల మున్నగునవి మిక్కుటముగ లభించుట వలననో పట్టణములు పుట్టుచుండును. వజ్ర భూమి సమీపమున గోల్కొండయు, బొగ్గుగను లుండుటచే ఝరియా పట్టణమును మణిశిలాఖనుల సమీపమున నాగ్రిపట్టణమును, యుక్తమైన మృత్తిక లభించుటచే కృష్ణనగరమును, ఉద్భవించి పెద్ద పత్తనములై యా యా ప్రదేశములం దొరకు వస్తువులకుఁ బ్రసిద్ధి కెక్కినవి. ఈ పురముల చుట్టుప్రక్కల నుండు గ్రామములలో శిల్పు లా ద్యా వస్తువులను నిర్మించి విక్రయమునకై పట్టణములం జేరి వాణిజ్యమును వృద్ధి పొందించు చుందురు.

భరతఖండంబున దేవాలయములు కొన్నిచోట్ల పట్టణోద్భవమునకు గారణము లైన వని చరిత్రకారు లూహించు చున్నారు. గీర్వాణ భాషలో "మందిర" పదము దేవాలయమునకే కాక గృహమునకును పట్టణమునకును కూడ చెందుచున్నది. "పూర్వ తమిళభాషలో "నకర" మను పదము, గృహము, దేవాలయము, రాజప్రాసాదము, దుర్గము, పురము, అను నర్థములలోఁ బ్రయోగింపబడు చుండెడిది. గృహ, దేవాలయ, ప్రాసాద, పురము లను భిన్నార్థములలో "నకర" పదప్రయోగము పూర్వ పురనిర్మాణ మూలహేతువును స్పష్టీకరించుచు నీ యీ భిన్నవిషయము లే యే విధముల పురనిర్మాణములో సమకూర్పబడ వలయునో తెలియఁ జేయుచున్నది" దేవాలయస్థానములన్నిచోట్లను రాజస్థానములు కాలేదని నిశ్చయము. కంజీవరము పట్టణము వలె దేవాలయ స్థానములు రాజులచే దమ ముఖ్యపట్టణములుగ బరిగ్రహింపఁ బడకుండిన నట్టివి యథావసరముగ వృద్ధిపొందును. కంజీవరము రాజధాని యగుటచే శిల్పశాస్త్ర నియమముల ననుసరించి వృద్ధి పొందించఁబడినది. హిందూదేశమున దేవాలయస్థ గ్రామాదులు విశ్వవిద్యాలయముల బోలియుండు. అట్టి ప్రదేశములఁ బండితులు వాసముల నేర్పరుచుకొని దైవసన్నిధానమున నధ్యయనామల్లం జేయుటయె కాక విద్యార్థులకు విద్యలఁ గఱపుచుఁ గాలముఁ గడుపు చుందురు. తఱచుగ సంసార సుఖాద్యనుభవము లందు విసుగుఁజెంది కొండఱు కాలము మళ్ళిన పిదప శేషకాలమును

దైవార్చనలు సలుపుచు వెళ్లబుచ్చుటకై ప్రసిద్ధ దేవాలయము లుండు ప్రదేశములకుం బోయి యేదియో యొక చోట స్థిరవాసముం గల్పించుకొని తత్కాలమును వెళ్లబుచ్చుదురు. కాలాతిక్రమమున యాత్రికులనల్ప సంఖ్యాకు లగు వారుత్సవ దినములలోఁ బోవుటం జేసియు, పైఁజెప్పఁబడిన కారణములవలన జనసంఖ్య హెచ్చగుటచేతను వర్తకులా ప్రదేశములం జేరి బజారుల స్థాపించుదురు. దేవాలయమును కేంద్రస్థానముగ జేసికొని క్రమముగ దాని చుట్టును గృహములు నిర్మింపఁబడును. అట్టి దేవాలయము చుట్టును అర్చకులును తదితర దేవ కైంకర్య పరులును గృహముల నిర్మించు కొందురు. మొదట ఈ గ్రామమై యుండియు తుద కట్టిది ఘనంబగు పురమగును.

పరిపాలనను సౌష్టవముతో నెరవేర్చుటకై భూపాలురు తమ రాజ్యములలో దుర్గముల నిర్మింపవలయును. కౌటిల్యార్థశాస్త్రంబున "స్థానీయము, ఎనిమిది వందల గ్రామముల మధ్యమునను, ద్రోణముఖము, నాలుగువందల గ్రామముల మధ్యమునను, ఖర్వాటికంబు రెండువందల గ్రామముల మధ్యమునను, సంగ్రహణంబు పది గ్రామముల మధ్యమునను స్థాపింపబడ వలయును." ఇట్టి సేన లుండెడి దుర్గములు కొన్ని చోట్ల పట్టణము లైన వని మనము గ్రహింపవలయును. కటక మన దుర్గము. "కటకము" "నగర్కోట" "మంగల్కోట" మన్నగునవి యీ రీతినే యుద్భవించిన వని నిశ్చయము.

పూర్వమున స్వీయ కార్య నిర్వహణములో చాల వఱకు గ్రామములు పరాధీనములు కాక యుండెడివి. గ్రామ శిల్పులు ప్రభువుల కార్యముల నియమానుసారముగ నెరవేర్చు చుండుటయు, యుద్ధాది సమయములలో నేర్పాటుల ననుసరించి గ్రామ వాసులు రాజకార్యములం బాల్గొనుటయు, మహత్తరము లగు గ్రామోపయోగ కార్యములలో వారు రాజసాహాయ్యమును బొందుటయు, గ్రామ వాసులు సత్రాదినిర్మాణములో కలసి పని చేయు నాచారములు సాధారణముగ దేశమున నుండెడి వని చరిత్ర నుడువుచున్నది.

పూర్వకాలములో దేశమున బహుసంఖ్యాకము లగు మండలములు స్వతంత్రి రాజులచేఁ బరిపాలింప బడుచుండెడివి. ఈ రాజులన్యోన్యము కలహించు చుండుటచే బ్రజలకు క్షేమ మతిస్వల్పముగ నుండెడిది. క్షేమము లేనిదే వాణిజ్యాదులు విస్తారముగ జరుగ వనియును, రక్షణ యుండిన గాని వర్తకులు వాణిజ్యమును విస్తారముగ జేయ రనియును నిశ్చయము. శత్రుభయము నుండి రక్షించు చుండుటచే రాజులు వసియించు ప్రదేశముల యందే వర్తకులు విక్రయస్థానంబుల నెలకొల్పుకొని వర్తకము జేయుచుందురు. వాణిజ్యము విస్తారముగ జరుగుచుండిన ప్రదేశములు బహుజనవాసస్థానములై పట్టణము లగు చుండును. ఈ కారణము వలన తఱచుగఁ బూర్వమున మండలాధీశ్వరులు తమ వాసమున కేర్పఱచుకొనిన గ్రామములే పట్టణము లగు చుండెను. మఱియు హిందూదేశంబున నింకొక విశేషము గాన్పించుచున్నది. పూర్వపు రాజులు, శత్రురాజులం జయించినప్పుడట్టి వారి ముఖ్య పట్టణములఁ దమ ముఖ్య పట్టణములుగ నొనర్పక జయింపఁబడిన రాజ్యములోఁ దమ దమ ముఖ్య పట్టణముల నూతనముగ నిర్మించుకొను చుండెడివారు. బహుశః జయింపఁబడిన రాజులు తమ ముఖ్య పట్టణముల ప్రాకారాదుల యందైన లోపముల లెస్సగ గుర్తెఱింగి యుండుటచే నా పట్టణముల సులభముగ ముట్టడించి జయింపఁ గల రను అనుమానమో, జయింపఁబడిన రాజులు తమ పట్టణముల యందు జేత నాశమునకై కూట యంత్రములను బన్ని యుండు నను భయమో సర్వ వైభవములతో గూడిన ఘనము లగు పట్టణములను నిర్మించి ప్రజల మనముల నాకర్షించుట యను నుద్దేశమో ఇట్టి పురనిర్మాణమునకు కారణములై యుండు. దీని కనుగుణముగ భోజమహారాజు "తన శత్రువు చేతనుగాని పర రాజు చేతనుగాని నిర్మింపఁ బడిన పట్టణమున వసియించు రాజు అచిరకాలములో మృతి జెందు" నని నిర్ణయించె. ఈ కారణము వలననే ఢిల్లీ మున్నగు పట్టణముల నంటి యనేక శిధిలములైన పట్టణము లున్నవి.

పూర్వభారతీయ రాజకీయ పరిస్థితులం జేసి పూర్వమున పట్టణములన్నియు రాజుల ముఖ్య పట్టణములై యుండెడి వనిన నత్యవిరుద్ధ

మై యుండదు. జయింపఁబడిన రాజులు రాజ్యముల వదలి పారి పోయి శతృభయము లేని ప్రదేశములలోఁ బురముల నిర్మించుకొని జీవించుటయుఁ గాన్పించకపోదు. ఇట్టి రాజవాసములు సేనానివాస స్థానములును, వాణిజ్యాదులకు కేంద్రస్థానములును, శిల్పులు మున్నగు వారు చేరి తమ కార్యములం జేయు ప్రదేశములును, అగుచుండు. అక్బర్ బాదుషాహిచేఁ జయింపఁబడిన చిత్తూరు పురమును రాణా ఉదయసింగు మహారాజు విడిచి క్షేమకరమును రక్షణ మొనంగునట్టి దియు నగు నొక దరి నాశ్రయించి యచ్చోట ఘన తటాకంబును త్రవ్వించి, రాజనగరు నా తటాకమున నిర్మించె. ప్రజలు క్రమ ముగ రాజు ననుసరించి పోయి యా ప్రదేశమును చేరిరి. అయ్యది పట్టణరాజం బగు నుదయపుర మయ్యె. ఈ పుర మతిరమణీయం బైన దని శిల్ప శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. చూపఱ కా పట్టణము ప్రాసాదమువలె కాన్పించు చుండు నని యాత్రికులు చెప్పు చున్నారు. అచ్చోట నుండు ప్రాక్స్వాకుని న్యాయశాల దివానీ ఆమ్ (దర్బార్ గృహము) దివానీఖాస్ (రాజ వాసము) చంద్రమహాలు, శ్రీ గోవింద దేవుని యాలయము శిల్ప శాస్త్రజ్ఞుల యొక్కయు తది తరుల యొక్కయు పొగడ్తలు గాంచినవి.

నూతన పురముల నిర్మించు నపుడును, పూర్వ పట్టణముల పునర్నిర్మాణముఁ జేయు నప్పుడును, శిల్పులు పూర్వావశేషంబుల నశింపఁ జేయక సాంప్రదాయకములైన విషయముల నిరాకరింపక పురచరిత్రము ననుసరించి తమ కార్యములం జేయవలయును.

కాంచి రంగాచార్యులు ఎం ఏ. బి యల్.

# ఆ శా కి ర ణ ము

నిశ్శబ్దంబై నిఖిల జగత్తును
నిద్రావశమై యుండగ;
నే నొక్కడనే నిన్ను దలంచుచు
నీ రిడు చుంటిని కిండ్లగ!

నిన్నే ప్రేమను నిజముగ పిల్చిన
నీవు విందు వని తోచెగ
నిన్ను వెంటనే వీక్షింపగ నను
వేగ వత్తు వని తోచెగ

•

అంకురించినది ఆశాకిరణం
బంధావృత మగు హృదిలో
నిస్సారంబగు నిజ దేహమునగ
నెలకొన జీవము త్రుటిలో!

అంతట నా గొంతగులు వట్లుగా
అరచితి నీకై సఖుడా
పేరుపెట్టి నిను పిలిచితి మరి మరి
ప్రేమ మీర నో సఖుడా!

నీ నామధ్వని నిబిడీకృతమై
నిండి దిశావళి వెలిగెన్
నీ నామామృత నిష్యందంబున
నిండి కర్ణములు చెలగెన్!

x—x

వేరొక శబ్దము వినరాకుండుట
పిలుపులు వ్యర్థం బాయెఁ
వెర్రివాడ వని వెక్కిరించు గతి
వీచుచు పవనుడు పోయెఁ

ఆశాకిరణం బంతరింపగా
ఆఃక్ష్యమె పెరిగెను హృదిలో
నిస్పృహ తోపగ నిజదేహం బది
నిస్సారంబై నిలిచెఁ !

నో: నరసింహశాస్త్రి